సత్యనారాయణమూర్తి, డి.

గుంటూరుజిల్లా జాగ్రఫీ

ఏలూరు, 1928

Record no. 447

## Bibliographic Record Target

సత్యనారాయణమూర్తి, డి.

గుంటూరుజిల్లా జాగ్రఫీ / ఇది డి. సత్యనారాయణమూర్తి గారిచే వ్రాయబడినది.- ఏలూరు : రామా అండ్ కో., 1928.

93 p. :ill., maps ;19 cm.

Record no. 447

Satyanārāyaṇamūrti, Ḍi.

Guṇṭūrujillā Jāgraphī / idi Ḍi. Satyanārāyaṇamūrti gāricē vrāyabaḍinadi.- Ēlūru : Rāmā aṃḍ Kō., 1928.

93 p. :ill., maps ;19 cm.

Record no. 447

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB        Date filming began:

# గుంటూరుజిల్లా జాగ్రఫీ.

S-284

ఇది

డి. సత్యనారాయణమూర్తి, బి. ఏ., ఎల్. టి,

హెడ్మాస్టరు, గవర్నమెంటు ట్రైనింగుస్కూలు, నర్సాపురం

గారిచే వ్రాయబడినది.

A. Sitaraman



పబ్లిషర్సు :

రామా అండ్ కో,

ఏలూరు.

పట్టాభి రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

1928.

 [వెల 0-4-0.

# FORE-WORD.

This new geography of the Guntur District is so framed as to suit the requirements of all Elementary Schools in the District. The plan of procedure is a perfectly novel one, based on nature study and observation in the first part, and regional study with the law of cause and effect in the second part. The third part is devoted to a brief treatment of the past History of the District ending with a full information of the present Taluks and their geography.

The Syllabus of Elementary Schools is closely followed and suggestion for intelligent handling by the teachers are also made in the form of questions at the end of each chapter.

The book is well-illustrated and contains good maps and is attractive to little boys. This can be suitably used as a Text-book in geography in all Elementary Schools. I have to offer my thanks to the publishers, Messrs. Rama & Co., who have kindly taken up the copy-right of the book. My thanks are also due to many of my numerous friends who have offered their suggestions in the writing of this book during the past three years. This being a fresh departure in the writing of the District Geographies, my co-educationists are requested to send me any suggestions or alterations which will be sincerely accepted.

(Sd.) **D. SATYANARAYANA MOORTY,** B. A., L. T,

NARASAPUR. 25—9—25.

Headmaster,
**Govt. Training School.**



గుంటూరుజిల్లా జాగ్రఫీ

మొదటిభాగము.

సామాన్య భూగోళ విషయములు.

అధ్యాయము I.

సూర్యుడు.

మనము నిద్రనుండి లేచుటతోడనే కొంచెము వెలుతురును చూతుము. ఈవెలుగు క్రమక్రమముగా వృద్ధిచెందును.

మేఘములు, వర్షము, కొండలు, భూమి, సముద్రము.

ఇది మనలోక మూలనుండి ఆకాశమునందు పైకి వచ్చుచుండు ఒక ఎఱ్ఱని బింబమునుండి వచ్చుచున్నట్లుఅగుపడును. ఈఎఱ్ఱని బింబమే సూర్యుడు. ఈబింబముగుండ్రముగకనబడును. ఈతని లోకబాంధవు డందురు. ఇతడు కనుపించుట తోడనే అన్నిజంతువులు నిద్రనుండి మేల్కొనును. అట్లేమనముకూడ మేల్కొనుచున్నాము. ఇట్లు ఆబింబము కనబడు కాలమునకు సూర్యోదయకాలమందుము. ఇతడుదయించు దిక్కునకు తూర్పుఅను పేరు. సూర్యోదయముతో చీకటిపోయిపగలుప్రారంభించును.

సూర్యోదయ కాలమందు సూర్యునివంక చూడుము. నీవు బింబమును చూడగలవా? చూడగలవు. బింబము ఎట్లుండును? ఎఱ్ఱగను, మిగుల పెద్దదిగను యుండును. నీవు మరకొంత సేపటికి భోజనముచేసి, పాఠశాలకు బోవు సమయమునమరల సూర్యుని వంక చూడుము. ఇప్పుడా బింబము వెనుకటి స్థలముననే గలదా? లేదు. ఆ బింబము క్రమ క్రమముగా ఆకాశమార్గమున పైకి వచ్చుచుండునట్లు చూడగలవు. వెనుకటి వలె నీవు బింబమును చూడగలవా? చూడలేవు. మరియు నీ బింబము చిన్నదిగను, తెల్లగ నుండును. నీవు బడినుండి 12 గంటలకు యింటికి వచ్చువేళ సూర్యునివంక చూడుము. నీకునడినెత్తిమీదకనబడును. నీవు అతనినిచూడ లేవు. అతని కిరణములు వాడిగలవై నీకన్నులు మూయునట్లు చేయును. ఈకాలమునకే మిట్టమధ్యాహ్న మందురు. పిమ్మట



నీవు బడికి తిరిగివెళ్ళి 5 గంటలకు ఆడుకొనువేళ సూర్యునివంక చూడుము. ఇప్పుడు సూర్యు డెచ్చట నుండును? ఉదయమున




చూచిన మూలనే చూచెదవా! సూర్యుడు ఒక ప్రక్కగా వాలిపోవును. ఉదయమున చూచిన ప్రక్కకు ఎదురుగానుండు ప్రక్కను చూతువు. బింబముకూడ పెద్దదిగను, ప్రొద్దుటివలె ఎఱ్ఱగను చూతువు. ఇప్పుడు మరల నీకన్నులు తెరచిబింబమును పూర్తిగా చూడగలవు. మరి కొంతకాలమునకు సూర్యుడు మనకు కనబడకుండ పోవును. వెలుగు తగ్గుట కారంభించును. చీకటి క్రమ్ముకొనును. ఈకాలమున కేసాయంకాలమందుము. సూర్యుడు యిట్లు కనబడకపోవు కాలమునకు సూర్యాస్తమయ

కాలమందురు. ఈ విధమున సూర్యుడు పగటికాలమందు ఉదయమునుండి అస్తమానము వరకు ఆకాశమార్గమున ప్రయాణము చేసినట్లు కనబడును.

సూర్యాస్తమయమై వెలుగు తగ్గుటతోడనే మనగృహములందు దీపములు పెట్టుదుము. దీపములులేకపోయిన మనకేమియు నగుపడదు. చీకటిగానుండును. ఈచీకటిసూర్యోదయముతో మాయమగును. వెలుతురుండిన చీకటి యుండదు. ఈ వెలుతురు నిచ్చువాడే సూర్యుడని చదివి యున్నారు. సూర్యునినుండి వెలుగు కిరణముల ద్వారా ప్రసరించును. ఈ వెలుగునకే ఎండయని పేరు. ఉదయమున నీవీ యెండలో ఆడుకొన గలవు. సూర్యునిచూడ గలవు. మధ్యాహ్నమట్లు చేయ గలవా? అట్లుచేయలేవు. పొద్దున ఎండ చల్లగను హాయిగను ఉండును. మధ్యాహ్నమా ఎండ అతివేడిగను తీక్ష్ణముగను యుండుటచే నీవు పాదరక్షలు, గొడుగు వేసికొని ఎండలో నింటికి వత్తువు. సాయంత్రము మరల నీవు ఎండలో ఆడుకొందువు. అప్పుడు కూడ ఎండ సుఖముగా నుండును. కనుక సూర్యుని కాంతియు, వేడిమియు, పగలంతయు నొకే తీరున లేదు. ఉదయ సాయంకాలములందు చల్లగను మధ్యాహ్నమందు తీక్ష్ణముగను వేడిగను ఉండుట నీవు తెలిసికొనుచున్నావు.

సూర్యుడు మనము నివసించు భూమి కంతటను వెలుతురును, వేడిమిని యిచ్చు బింబము. ఇతనివలననే యీలోకము



లోని సమస్త జీవరాసులు వృద్ధిపొందుచున్నవి. కనుక నితనికి లోకబాంధవుడని పేరు.

### అభ్యాసము-బాలుర పరిశీలన.

1. సూర్యోదయ కాలమును గుర్తించుట.
2. 12 గంటలకు సూర్యుడు నడినెత్తి మీదనుండు స్థానమును గుర్తించుట.

## చంద్రుడు.

రాత్రులందు నీవు ఆటలనాడుకొంటివా? ఆడుకొంటివి. అట్టిరాత్రులు చీకటిరాత్రులేనా? కావు. చీకటిగానుండక వెలుతురుండును. ఈవెలుగు ఎక్కడనుండి వచ్చును? ఆకాశమున నీవేమి చూడగలవు? ఈవెలుగు ఆకాశముననున్న గుండ్రని తెల్లని బింబమునుండి వచ్చునట్లు చూతువు. ఈబింబమే చంద్రుడు. ఈతనివెలుతురే వెన్నెల. వెన్నెల చల్లగను సుఖముగను యుండును. నీవు బాగా చంద్రబింబమును చూడగలవు. ఈబింబమును ప్రతి రాత్రియందు గుండ్రముగా చూచినావా? లేదు. ఒకరాత్రియందు సన్నని చీలికగను మరొకరాత్రియందు అర్ధబింబముగను యింకొక రాత్రియందు పూర్ణబింబముగను కనుబడును. కొన్ని రాత్రులయందు చంద్రునిమనము చూడము. అట్టిచీకటి అమావాస్య నాడుండును. పూర్తిబింబము పౌర్ణమి నాటిరాత్రి కనుపించును. పౌర్ణమితర్వాత 15దినములకు అమావాస్య వచ్చును. పిమ్మట 15 దినములకు పౌర్ణమివచ్చును. ఇట్లు నెలకొకసారి అమావాస్యయు, పౌర్ణమియును వచ్చును.

సూర్యుడస్తమించగనే చంద్రుని ప్రతిరాత్రియు తూర్పున చూడలేము. కొన్ని రాత్రులందు అర్ధరాత్రమున చంద్రుడుద



వెన్నెల రాత్రి, చంద్రుడు.

యించును. మరియొకప్పుడు పట్టపగలే చంద్రు నాకసమున జూతుము. కనుక ప్రతి రాత్రియందును చంద్రుని వెలుగు సమానకాల ముండుట లేదనియు, ఒకే కాలమునందు ఉదయించి అస్తమించుట లేదనియు తెలియుచున్నది.

సూర్యకిరణములవలెగాక చంద్రుని కిరణములు చల్లనై యుండి విశేష ప్రకాశవంతముగ లేవు. అందుచే వెన్నెలయందు బాగుగ చదువలేము. వేడిమి యేమాత్రము నుండదు.



1. చంద్రుని ప్రతిరాత్రియందు ఆకారభేదము, ఉదయించు కాలభేదము ఒక నెలదినములు గమనింపచేయుట.
2. చంద్రబింబములోని హెచ్చు తగ్గులు, పటములు గీయుట.

## అధ్యాయము II.

### గాలి–వాన.

నీవు బడికి ఎండలో వేగముగా పరుగెత్తికొని వచ్చినపుడు నీకు చెమట పోయును. నీవు తరగతిలో కిటికీవద్ద కూర్చుండిన యెడల ఆ చెమటను ఆరిపోవును. ఇట్లుపోవుట గాలి తగులుటవలన కలుగుచున్నది. ఈ గాలి వాతావరణములో కదలికవలన కలుగును. దీనిని మన శరీరమునకు తగులుటవలన తెలిసికొనగలము. వాయుచలనము వలననే చెట్ల ఆకులు, కొమ్మలు కదలుచుండుట చూతుము. పెద్దగాలి వీచునప్పుడు చెట్లు వేళ్ళతో పెకలించబడుట చూచుచున్నాము. గాలి మన శరీరములకు సోకినయెడల సుఖముగా నుండును. చలిగానున్నపుడు వెచ్చనిగాలి, వేడిగా నున్నపుడు చల్లనిగాలి శరీరమునకు తాకినట్లయిన హాయిగా నుండును. నీవు బడికిపోవునప్పుడు నీబట్టలు గాలిలో నెగురుట చూతువు. కొంచెము యిసుక నెగురవేసిన నట్లేపోవును. దీనినిబట్టి గాలి ఒక దిశనుండి మరియొక దిశకు వీచుట కనుగొందువు. ఈ దిశ తరుచుగా మారుచుండును.

పగలు మనకు సూర్యుడప్పుడప్పుడు మసుగు పడుచుండును. మేఘములా బింబమును కప్పి పుచ్చును. ఈ

మబ్బులు ఒకప్పుడు తెల్లగను, నల్లగను, నీలవర్ణముగను ఉండును. వీనిలో తెల్లగ దూదివలె నుండునవి మనకు చాలా ఎత్తున నున్నవి. నీలమేఘములు నల్లగ, దట్టముగ నుండును. అవి మనకు సమీపమున నుండు కొండ గుట్టలకుకూడ ఆనుకొని యుండును. ఇవియే వర్షమునిచ్చునవి. ఇవి ఆకాశమునంతయు దట్టముగ నల్లుకొనును. అప్పుడే కొంచెము చల్లటిగాలి ప్రారంభించును. వెంటనే చినుకులు పడును. ఇవియే పెద్దవియై పెద్దవర్షము కురియును. వాన కురియునప్పు డాకాశమువంక చూడుము. ఒక మేఘమును మఱొక మేఘము తరుముకొని పోవునట్లు జూతుము. కొన్ని సమయములు ఉరుములు, మెరుపులు వీని నుండి గలుగుట చూతుము. ఈవర్షమువలన నేలతడసి పచ్చని గడ్డిమొలచును. నేలయంతయు మెత్తనగును. గుంటలు, చెరువులు, బావులు, మంచినీటితో నిండును. సమీపముననుండు కొండలలోనుండి నీరు ధారలుగా ప్రవహించును. వర్షపునీరు రుచిగను ఆరోగ్యకరముగను ఉండును. వర్షాకాలములో పైరులు, కూరగాయ మొక్కలు బాగుగా వృద్ధిచెందును.

| సంవత్సరము | 1 | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నెలలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| ఋతువులు | 1 | | 2 | | 3 | | 4 | | 5 | | 6 | |

| సంవత్సరములు | 1 | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తెలుగు నెలలు | చై | వై | జ్యే | ఆ | శ్రా | భా | ఆ | కా | మా | పు | మా | ఫా |
| ఋతువులు | వసంత | | గ్రీష్మ | | వర్ష | | శరద్ | | హేమంత | | శిశిర | |



| సంవత్సరము | 1 | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఇంగ్లీషు నెలలు | M | A | M | J | J | A | S | O | N | D | J | F |
| ఇంగ్లీషు అంకెలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| ఋతువులు | Spring | | | Summer | | | Autumn | | | Winter | | |

## అధ్యాయము III.

### శీతోష్ణస్థితి, సంవత్సరము, నెలలు, ఋతువులు.

నీవు ఒకప్పుడు బడికి బోవునప్పుడు వర్షము కురియుచుండును. మరియొకప్పుడు బట్టలు నిండా ధరించుకొనినను చలిగనే యుండును. ఒకప్పుడు నీశరీరమునకు వేడిగాలిసోకి చెమటపోయుచుండును. కొన్ని దినములలో ఉదయముననే లేచిచూడగనే వీధిలో తెల్లనిపొగవలె చెట్లన్నియు కప్పియుండును. వాని యాకుల నుండి నీటిబిందువులు పడుచుండును. గడ్డియంతయు తేమగా నుండును. అట్లుండినప్పుడు మంచు పట్టినదని యందుము. ఇట్లు సంవత్సరములో కొన్ని నెలలు చలిగను కొన్ని నెలలు వేడిమిగ నుండు భేదములు శీతోష్ణస్థితి భేదము లందుము. దీనికే కాలము మారినదని చెప్పుదుము. ఈ ఋతువులు మనకు క్రమముగా ఒకదాని వెనుక నొకటి ప్రతిసంవత్సరము ఆయా నెలలలో కలుగుచున్నవి.

నీకు సంవత్సరము ఆఖరున పరీక్షలు జరుగు ఏప్రిలు నెలలో ఎండ వేడిమి హెచ్చుగా నుండును. పిమ్మట రెండు నెలలు నీకు వేసవి శెలవులు వచ్చును. నీవు బడిలో తిరిగి ప్రవే

శించగానే వేడిమి తగ్గి వర్షములు ప్రారంభించును. మరి రెండు నెలలకు చలి ఎక్కువగును. అప్పుడు నీకు సంక్రాంతిపండుగ శెలవులు వచ్చును. అప్పుడు చలి పోవుటకు భోగిమంటలు వేసికొందుము. తర్వాత ఎండలు ఎక్కువగుచు చలి తగ్గును. మరియు ప్రతి ఋతువునందు శీతోష్ణస్థితిలోను, పండ్లు, పువ్వులలోను భేదములు క్రింది పట్టిక వలన గమనింపుము.

1. వసంతఋతువు:—2 నెలలు. చైత్రము, వైశాఖము. ఇంగ్లీషు నెలలు ఏప్రిలు, మే నెలలు. ఈరోజులలో ఎండ ఎక్కువగా నుండును. చెట్లు చిగుర్చును. మల్లెపూవులు పూయును. మామిడికాయలు, నేరేడుపండ్లు, పనసపండ్లు వచ్చును. నీకు పరీక్షలు జరిగి శెలవులు యివ్వబడును.

2. గ్రీష్మఋతువు:—2 నెలలు. జ్యేష్ఠము, ఆషాఢము. జూను, జూలై నెలలు. ఎండ వేడిమి హెచ్చగును. వేడిగాలి, వడగాలి వీచును. దుమ్ము రేగును. బయటికి రాలేవు. నేల ఎండిపోవును. మామిడిపండ్లు చాలా వచ్చును. కూరగాయలు ఏమియు దొరకవు. నీకు స్కూలుకు వేసవి శెలవులు గనుక నీవు యింటిలోనే యుందువు.

3. వర్షఋతువు:—శ్రావణము, భాద్రపదము, ఆగష్టు, సెప్టెంబరు నెలలు. ఎండలు తగ్గిపోవును. తొలకరివానలు కురియును. అప్పుడప్పుడు మబ్బులుపట్టి వర్షములు కురియును. నేల



గడ్డిపట్టును. కూరగాయల చెట్లు మొలచును. చేమంతిపూవులు పూయును. బత్తాయి, నారింజపండ్లు, నిమ్మపండ్లు, పంపరపనాసపండ్లు చాలా ఫలించును. నీవు బడికి వెళ్ళుచుందువు. అప్పుడప్పుడు పెద్దవర్షములు కురిసి వెలియుచుండుటచే నేల బురదగా నుండును. పొలములలో వరి, జొన్నపైరులు నాటుదురు.

4. శరదృతువు:—ఆశ్వయుజము, కార్తీకము, అక్టోబరు, నవంబరు నెలలు. ఎండవేడిమి తగ్గుచుండును. కొద్దిగా తెల్ల




రాత్రింబగళ్లు

వారుజామున చలి ప్రారంభించును. చెట్ల ఆకులు రాలుచుండును. మొక్కజొన్న కంకులు విశేషముగా వచ్చును. పగటి

ప్రొద్దు తగ్గుచుండును. జామపండ్లు, సీతాఫలములు, విశేషముగా ఫలించును. దీపావళిపండుగ వచ్చును.

5. హేమంతఋతువు:—మార్గశిరము, పుష్యము, డిశంబరు, జనవరి నెలలు. చలి హెచ్చగును. ఈదురుగాలి పగలంతయువీచును. పగలు పొద్దుచాలాతక్కువ. వరి, చెఱకు పండును. బంతి, ఊకబంతి పూవులు పూయును. కమలాఫలములు, నారింజపండ్లు, రేగుపండ్లు చాలాపండును. సంక్రాంతి పండుగ యీఋతువులో వచ్చును.

6. శిశిరఋతువు:—మాఘ, ఫాల్గుణ మాసములు, ఫిబ్రవరి, మార్చి నెలలు. చలి తగ్గుచుండును. పగలు వేడిమి హెచ్చును. పసుపు, జనుము బాగా ఫలించును. శివరాత్రి పండుగవచ్చును. ఈనెలలో ఉదయమున స్నానమాచరించిన పుణ్యము కలుగునని చెప్పుదురు.

### ప్రశ్నలు.

1. నీకు ఏఋతువులలో వేసవికాలపు సెలవు లిత్తురు?
2. నీకు దసరా సెలవులు ఏఋతువునందు వచ్చును?
3. సంక్రాంతి పండుగ ఏ ఋతువులో వచ్చును? ఆ పండుగ నెట్లు ఆచరింతురు?

## అధ్యాయము IV.

### భూమి—జలము.

మనము నివసించునదే భూమి. ఇది మనము నలువైపులను చూచిన బల్లవలె చదునుగా నున్నట్లగపడును. అయితే



ఇది నిజముగ అట్లు లేదు. నారింజపండువలె గుండ్రముగనున్నది. విశాలమయిన బయలునకుపోయి చూచినట్లయిన భూమి ఆకాశమును తాకుచున్నట్లు చూతుము. ఇది గుండ్రముగా నుండును. దీనికి దిక్చక్రమని పేరు. పెద్ద బంతివలె నుండు నీభూమిపై మనము, మనగృహములు, జంతువులు మొదలైనవి పడిపోకుండునట్లు చేయుటకు దీనిలో నొక ఆకర్షణశక్తి గలదు. ఆ శక్తివలననే భూమి మనము తెలిసికొనలేనంత వేగముగా తన చుట్టు తాను తిరుగుచున్నది. ఎంతవేగముగా తిరిగినను ఒక చుట్టు తిరుగుటకు (24 గంటలు) ఒక దినము పట్టుచున్నది. ఈకాలములో సగము సూర్యునికెదురుగను, సగముచీకటిలోను యుండును. ఈవెలుగుగానుండు కాలమునకు పగలనియుచీకటిగానుండు కాలమునకు రాత్రియనియు పేరు. ఈమార్పులు ప్రతిదినము భూచలనముచే కలుగుచున్నవి.

భూమి తనచుట్టు తాను తిరుగుటయే గాక సూర్యుని చుట్టుగూడ తిరుగుచున్నది. సూర్యబింబము మన దృష్టికి చిన్నదిగ కాన్పించుచున్నను మన భూమికంటె అనేకవేలరెట్లు పెద్దది. ఇట్టి సూర్యుని మహావేగముతో ఒకసారి భూమి తిరిగి వచ్చుటకు 365 రోజులు పట్టును. ఈ కాలమునకే ఒక సంవత్సరమని పేరు. సంవత్సరములో భూమి సూర్యునికెదురుగా అనేక విధములగు స్థానములలో నుండును. ఈస్థాన భేదములవలననే ఋతుభేదములు కలుగుచున్నవని ముందు తరగతులలో మీరు నేర్చుకొందురు.

మీరుండు పట్టణమందుగాని గ్రామమందుగాని కొన్ని వీధులు ఎత్తుగను, కొన్ని పల్లముగనుండుట మీరు చూచియుందురు. కనుక మీ చుట్టునుండు భూమి పై భాగమంతయు సమమట్టముగా లేక హెచ్చు తగ్గులుగా నున్నట్లు కనబడుచున్నది. ఎత్తుభాగములకు మెట్టలనియు లేకవీత భూములనియు పేరు. ఆపల్లపుప్రదేశములకు మైదానములనియు పేరు. ఎత్తుప్రదేశములం దచ్చటచ్చట రాతిగుట్టలుండును. వీనినేకొండలనియు పర్వతములనియు గుట్టలనియు పిలుతుము. మీగ్రామములో కొండలు గలవా? మీకు సమీపమున గలవా? ఎచ్చట గలవు? మీరు వాని నెక్కగలరా? ఏటవాలుగ నున్న ఎక్కుట సులభము. నిట్రముగానున్న కష్టము. రెండు కొండలమధ్య ప్రదేశము లోతుగా నుండును. దీనినే లోయ లేక కనుమ యందురు. పల్లపు ప్రదేశములు సముద్రమట్టమునకు సమముగా నుండును. అవి చాలచోట్ల యిసుకతోడను, కొన్ని చోట్ల నల్లరేగడ బురదతోడను, కొన్నిచోట్ల చవుడుతోడను నిండియుండును.

గ్రామములందును, పట్టణములందును వర్షకాలమందును నీరంతయు ఎత్తునుండి పల్లములకు ప్రవహించి, పల్లములందు గుంటలలో చేరును. వీనినే చెరువులని, గుంటలని, తటాకములని పిలతురు. వర్షములేనిచో వీనిలో నీరుండదు. వర్షజలమే వీని కాధారము. వర్షపునీటిపై ఆధారపడకుండ విశేష



జలముతో నిండియుండు విశాలమగు జలప్రదేశములు భూమిపై గలవు. వీనికే సముద్రములని పేరు. మీరు సముద్రమును చూచితిరా! చూచుటకు మిగుల భయంకరముగా, పెద్ద ధ్వనితో ముందుభాగమున నీరు పెద్ద అలలవలె లేచి క్రిందకు పడుచు తెల్లని నురుగుతో కప్పబడి యుండును. దీనిలో నీరు నాలుక కోసుకొనిపోవునంత ఉప్పగా నుండును. ఈ జలభాగము భూభాగముకంటె యెంతయో పల్లముగనుండును. అందుచే భూమిపైబడు జలములో విశేషభాగము దీనిలోనికి చేరుచున్నది. వర్షజలము భూమిపైనుండి సముద్రమునకు అనేక విధములుగా ప్రవహించి చేరుచున్నది. వీనిలో పెద్ద ప్రవాహములకు నదులనియు, చిన్నవానికి గొండవాగులనియు పేర్లు. కొన్ని చిన్ననదులు పెద్ద నదులయందు చేరుచున్నవి. వీనిని ఉపనదులందురు. వర్షముకురిసినప్పుడు వీధులలో నీరుఎత్తునుండి పల్లమునకు ప్రవహించునప్పుడు నదులవలె ప్రవహించు కాలువలు, ఉపనదులు చూడగలము. ఈకాలువలు గుంటలో పడు చోట అనేక శాఖలుగా చీలును. అట్లే నదులు కూడ సముద్రమున గలియుచోట శాఖలుగా చీలియుండును. వీనియాకారము త్రిభుజమువలె నుండును. దీనికి గ్రీకుభాషలో డెల్టాయందురు. ఇట్టి డెల్టా భూములు ప్రతి నదీముఖద్వారమువద్ద నుండును. కొండయందు కురియు వర్షజలము వాగులుగా ప్రవహించి లోయలయందు, గుంటలయందు చేరును. అట్టిజలాశయములకు సరస్సులని పేరు. అవి ఎల్లప్పుడు స్వచ్ఛమైన మంచినీటితో

నిండియుండును. సరస్సులు చూచుటకు రమ్యముగ నుండును. ఈ విధముగా భూమియొక్క సహజ స్వరూపము అనేక పేర్లతో వర్ణింపబడుచున్నది.

## ప్రశ్నలు.

1. సరస్సును చూచితివా ? అది ఎచ్చటనుండును ?
2. సముద్రతీరమున నుండు అలలను పరికించి చూడుము.
3. వర్షము కురియునపుడు బాలురచే స్కూలు ముందు నది, ఉపనది, జలాపాతము, డెల్టా మొదలగు చిన్న స్వరూపములు పరిశీలింప జేయుము.

## అధ్యాయము. V.

### నేలపైనను, పటముపైనను దిక్కులు.

నీవు యిప్పుడెచ్చట కూర్చుండి యున్నావు? నీవు కూర్చుండిన గదికి ఎన్నిప్రక్కలు లేక వైపులున్నవి? నాలుగు ప్రక్కలున్నవిగదా! నీవు గదిలో నిలబడి చూచిన నీకెదురుగా నొక ప్రక్క, నీవెనుకనొక ప్రక్క, నీకుడిచేతివైపు ఒకప్రక్క, నీకెడమచేతివైపు ఒకప్రక్క. నీవుమరియొకవైపు తిరిగి నిలుచుండిన యీదిక్కులుమారును. మరియునీకెదురుగానింకొక బాలుడు నిలువబడినయెడల అతని ముందువైపు నీ వెనుకవైపు అగును. అతని కుడిచేతిప్రక్క, నీ ఎడమచేతి ప్రక్కయగును. కనుక నీ నాలుగుదిక్కులకు సర్వసాధారణముగా అందరు ఒకేవిధముగ గుర్తించుటకు నాలుగుపేర్లు యివ్వబడినవి. ఈనాలుగుదిక్కులను



మన మేస్థానమందుండినను వానిని కనుగొనవచ్చును. అదెట్లన నీవు పెందలకడలెమ్ము. ఉదయముననే సూర్యునికి ఎదురుగా ముఖమునుంచి నిలువబడుము. నీ కెదురుగా నుండు దిక్కే తూర్పుఅనిపేరు. అప్పుడు నీవెనుక దిక్కు పడమర. నీవు అట్లే యుండి రెండు చేతులను చాపుము. నీ కుడిచేతివైపు దిక్కుకు దక్షిణము అని పేరు. నీ ఎడమచేతివైపు దిక్కు ఉత్తరము. ఇట్లే నీవు ఏ ప్రదేశములోనికి వెళ్ళినను సూర్యుడుదయించు




దిక్కునకు ముఖమును త్రిప్పి నిలువబడుము. అప్పుడు దిక్కుల పేర్లను సులభముగ చెప్పుదువు. నీవు కూర్చుండు గదిలోకూడ

అట్లే ఆప్రదేశములో సూర్యుడుదయించు ప్రదేశమున కెదురుగా నిలువబడి, నీగదిలోని నాలుగు ప్రక్కలు సులభముగా చెప్పాదువు. ఏప్రదేశములో నైనను సూర్యుడుదయించు దిక్కు తూర్పు. అస్తమించు దిక్కు పడమర. నీవు తూర్పున కెదురుగా నిలువబడి నీచేతులు చాచినయెడల ఎడమచేతివైపు ఉత్తరము. కుడిచేతివైపు దక్షిణము. నీగదిలో తూర్పున నేమున్నది?దక్షిణమున నేమున్నది?నీస్కూలుకు నలుదిక్కుల యొక్క పేర్లు చెప్పి, ఆయావైపులనుండు చెట్లనో, గోడలనో, నూతినో గుఱుతింపుము.

నీవు ఎంతదూరమును చూడగలవు ? ఒకమైలు లేక రెండుమైళ్ళు చూచెదవు. సమమగు మైదానములో నైను లేక ఆరుమైళ్ళు చూడగలవు. చాలా విశాలమైన ప్రదేశము చూడ లేవు. కనుక దానిపటము, లేక బొమ్మను వేసెదవు. నీవు ఒక గుఱ్ఱమును చూచితివా ! చూచితివి. దాని బొమ్మను గీయ గలవు. దేనిమీద గీయుదువు. దాని ఆకారమును ఒక చిన్న పలక, లేక కాగితముమీద గీయుదువు. నీ బొమ్మ గుఱ్ఱమంత పరిమాణ ముండదు. అట్లే ఒక పెద్ద దేశపటమును చిన్న పరిమాణములో పటముగీతువు. నీగదిపటము చిన్నదిగాగీయుము. దానిలో దిక్కులపేర్లు నీవు కనుగొనిన విధమున వ్రాయుము. నీపటములో ఒకప్రక్క ఒకజేనెడుండును. ఇది నీగదిలో 10 గజముల పొడుగు. ఇట్లే అంగుళములలో కొలచి, నీపటములో నెన్ని యంగుళములు,నీగదియందు ఎన్నిగజములుసూచించునో



తెల్పుము. ఇట్లే స్కూలు పటము గీయుము. దీనిలో నెన్ని యంగుళములు, ఎన్ని గజములు సూచించును ?

(అం 1= 20 గజములు.) దీనికే స్కేలు అని వాడుదుము.




పటమును గీచినతరువాత నేలమీద దిక్కు లెట్లున్నవో అట్లే పటము మీదకూడా వ్రాయవలయును. ఈ పటమును గోడకో, బోర్డుకో వ్రేలాడ గట్టవలయును. ఏదిక్కు పైవైపునకు పెట్టవలయును ? ఏదిక్కు అయినను పెట్ట వచ్చును. అయితే మనము అందరము ఒకే విధముగా పటమును వ్రేలాడ వేయుదుము. పైభాగము ఉత్తరపువైపు. అప్పుడుతతిమ్మాదిక్కులు చెప్పుము. నీవు పటమున కెదురుగా నిలువబడి చూచి నట్ల

యితే నీపైవైపు ఉత్తరము, అడుగువైపు దక్షిణము, నీకుడిచేతివైపు పటమునకు తూర్పు, ఎడచేతివైపు పడమర. ఈదిక్కులు నీగదియందు జోర్డుమీద గురుతింపుము. అట్లే నీగదిలోని పటములన్నియు పరీక్షించి దిక్కులు చెప్పుము.

నీవు ఏపటమునకైనను దిక్కులుకనుగొనవలసినయెడల దాని కెదురుగ నిలువబడుము. దాని పైభాగము ఉత్తరము, అడుగుభాగము దక్షిణము అని చెప్పుము. నీకుడిచేతి కెదురుగా నుండు పటమువైపు పటమునకు తూర్పు. నీఎడమచేతి కెదురుగానుండు పటమువైపు పడమర. నేలమీద వేసిన పటమును ఉత్తరము దిక్కుపైకి పెట్టి వ్రేలాడగట్టిన యీదిక్కులే వచ్చునని గమనించ గలవు.

### ప్రశ్నలు.

1. నీవు చదువు గదిలో నాలుదిక్కుల పేర్లు చెప్పి, అచ్చటి వస్తువుల పేర్కొనుము.
2. నీస్కూలునకు నీవేదిక్కునుండి వెళ్ళుదువు?
3. నీస్కూలుగేటు ఏదిక్కున నున్నది?
4. నీయింటిముందు రోడ్డు ఏదిక్కునుండి ఏదిక్కునకు పోవుచున్నది?
5. మీస్కూలులో పటమునకు దిక్కులు చెప్పుము.
6. నీగదియొక్క ప్లాను గీయుము? దిక్కులు చెప్పుము?
7. నీస్కూలు దిక్కులు కనుగొనుము? నీస్కూలుముందు రోడ్డు ఏ దిక్కునుండి ఏదిక్కునకు పోవును?



## అధ్యాయము VI.

### జనులు, వారి ఆహారము, వృత్తులు, దుస్తులు.

మనమందరము యీభూమిమీద నివసించుచున్నాము. మనలను ప్రజలమని, జనులు లేక మనుష్యులమని పిలుచుకొనుచున్నాము. మనము యీ ప్రదేశమును నివాస స్థలముగా జేసికొనియున్నాము. మనము జంతువులవలె వృక్షములక్రిందను, అడవులలోను, యుండుటలేదు. ఏ ఆకులనో, కందముక్కలనో, పండ్లనో తిని జీవించుటలేదు. మనచుట్టునుండిన వస్తువుల నుపయోగించుకొని మనము కొన్ని వసతులు నిర్మించుకున్నాము. మీగ్రామములో ఇండ్లు చూడుము. ఇవి కొన్ని పూరిండ్లు. కొన్ని ఎఱ్ఱగా కాలిన యిటుకలతోను, పెంకులతోను కట్టిన యిండ్లు కొన్ని మేడలుగలవు. ఇంకా పెద్ద పట్టణములకు పోయినట్లయితే పెద్దమేడలు గొప్పకట్టడములను చూతువు. అచ్చట మట్టితో కట్టినయిండ్లు తక్కువ. కాబట్టి మనభూమిమీద దొరకు వస్తువులను మన యుపయోగముకొరకై వాడుకొని నివాసము లేర్పరుచుకున్నాము. రేగటిమట్టి, గడ్డి, తాటాకులు చాలా దొరకు గ్రామములలో అన్నియిండ్లును మట్టిగోడలతో, పూరిండ్లు కట్టుదురు. కొండలు, రాళ్ళు విరివిగ గల గ్రామములలోనే వానితో కట్టుదురు. అడవులలో నుండువారు అచ్చటి వెదుళ్ళు, కఱ్ఱలు, చెట్టుమానులతోనే యిండ్లనునిర్మించుకొనుచున్నారు. కనుక జనులకు సహజముగా భూమిమీద

ఆప్రదేశములో దొరకు వస్తువులనే యుపయోగించి యిండ్లు కట్టుదురు. చలిదేశములలో కొందరు ఎస్కిమో లనువారు మంచుగడ్డతో యిండ్లు కట్టుకొని నివసించుచున్నారు. మన యిండ్లకు పైకప్పుండును గాని ప్రక్కగోడలు కూడ నుండవు. మనము ఎండకు, వానకు కావలసిన యిండ్లే కట్టుచున్నాము. అద్దపు తలుపులతోను గాలిరాని గట్టి గోడలతోను చలిదేశములలోనివారు యిండ్లు కట్టుదురు. కాబట్టి మన నివాసస్థలము




లను మన గ్రామపు శీతోష్ణస్థితిని, అచ్చటి నేలపై దొరకు వస్తువులను బట్టియే కట్టుచున్నాము.



మనము భుజించు ఆహారమేమి? కందలను, వ్రేళ్ళను, ఆకులను, గడ్డిని తినుచున్నామా? లేదు. మనముమంచిధాన్యములు పండించుకొని తినుచున్నాము. నేలనుదున్ని, గింజలు చల్లి పండించుచున్నాము. రాతినేలమీద దున్ని, గింజలు వేయుదువా? నీతోటలో గింజలు ఎట్టిచోట వేసిన మొలకలెత్తును? మంచి, మెత్తనినేల కావలెను. కనుక నేలను పట్టి గింజలు వేయుదువు. మీగ్రామముచుట్టు పొలములలో వరినే పండింతురు. కొన్నిచోట్ల జొన్ననే వేయుదురు. కనుకమనము పండించు పంటలు ఆప్రదేశములో నేలనుబట్టి, నీటివసతినిబట్టి, శీతోష్ణస్థితిని బట్టి, ఏధాన్యము బాగుగ పండునో విచారించి, పండించుచున్నాము. కనుక మనమందరము వరి అన్నము కూరగాయలు తిందుము. కొన్ని చలిదేశములలో గోధుమ రొట్టెనే తిందురు. ఏల? వారి దేశములో చలి యెక్కువ. వరి పండదు. గోధుమలే పండును. ఒక దేశములోపుర్రగడ్డలనే ఉడికించి తిందురు. కనుక మనము తిను ఆహారముకూడ, నేల యొక్క స్థితినిబట్టి, శీతోష్ణస్థితినిబట్టి, నీటివసతినిబట్టి, అచ్చటి పంటలనుబట్టి మారుచున్నది. అడవులలో నివసించువారు వేటాడిన మాంసమునే తిందురు. పల్లపు ఉష్ణప్రదేశములలో వరి బియ్యము తిందురు. మెట్టప్రదేశములలో వరిగ, జొన్న, సజ్జ, మొక్కజొన్న పంటలనే తిందురు.

మనము జంతువులవలె మనశరీరములుంచుకొనుట లేదు. శుభ్రమైన దుస్తులు ధరించుకొందుము. నీవులాగును, చొక్కా

యును, టోపీని ధరించుకొనియున్నాడు. మరియొకడు గోచి మాత్రమే పెట్టుకున్నాడు. అడవులలో జనులు ఆకులు, గడ్డితో చేసినచొక్కాలు వేసికొందురు. కొందరుదొరలు, దొరపిల్లలు, బూడ్సు, మేజోళ్ళు, కోటు మొదలైన దుస్తులు వేయుదురు. మన దేశములో నుసము నడుమున నొకబట్ట, పైనవుత్తరీయము వేసికొందురు. ఎక్కువ బట్టలు వేసికొనిన చెమ్మటపోయును. కష్టముగా నుండును. మన ప్రదేశము వేడిదేశము. దొరలు వుండు ప్రదేశము చలిదేశము. కనుక వారు బూడ్సులులేనిదే నడువలేరు. అచ్చట వారు బొచ్చుతో చేసిన కోట్లు, వూలు లాగులు ధరింతురు. కొన్ని అడవులలో నివశించువారు శరీరమునకు రంగు పూసికొందురు. ఆకులు చుట్టుకొందురు. కనుక మనుష్యులు తమ వేషములను కూడా శీతోష్ణస్థితిని, అచ్చట దొరకు పదార్థములనుబట్టియు మార్చుకొనుచున్నారు. కనుక నేమనముదూదితో చేసినబట్టలు వాడుదుము. మన దేశములో ప్రత్తి బాగుగ పండును. దొరలు ఉన్ని, ఊలుబట్టలు వాడుదురు. అచ్చట గొఱ్ఱెలు చాలా గలవు. ఉన్నిబట్ట లుండినగాని చలినుండి తప్పించుకొనలేరు. అట్లేఅడవులలోని వారు ఆకులు, గడ్డితో చేసిన దుస్తులు ధరింతురు.

మీరు చదువుకొనుచున్నారు. మీతండ్రులుకొందరు ఉద్యోగములు చేయుచున్నారు. కొందరువర్తకముచేయుదురు. కొందరుకూలిచేయుదురు. కొందరుబంగారునగలుచేయుదురు.



కొందరు చేపలు పట్టుదురు. ఇట్లే మనుష్యులందరు కొన్ని కొన్ని పనులు చేయుచుందురు. ఎవరు చేయుపని వారి వృత్తియని పిలుతుము. వర్తకము, వ్యవసాయము, కూలిపని, వడ్రంగిపని, కమ్మరిపని, కంసాలిపని మొదలగునవి వృత్తులు. మన దేశములో చాలమందికి వ్యవసాయము ముఖ్యవృత్తి. కొందరు బట్టలనేత నేయుదురు. సముద్రతీరమందుండువారందరికి చేపలు బట్టుట ముఖ్యవృత్తి. అడవులలో నుండువారికి కట్టెలు కొట్టుట, వేటాడుట, ముఖ్యవృత్తులు. తోళ్లను అమ్ముచుందురు. కొన్ని దేశములలో యంత్రములలో పని, గనులలో పని, ముఖ్యవృత్తులు. కొన్ని కొండప్రదేశములలో రాళ్ళుచెక్కుట, కొండలు పగులగొట్టుట, మొదలగు పనులు మనుష్యులు చేయుదురు. కనుక మనుష్యుల వృత్తులను కూడ వారు నివసించు ప్రదేశమును బట్టియు, అచ్చట దొరకు వస్తువులను బట్టియు, మార్పు గలుగుచున్నది. కనుక మనుష్యులజీవితములో యీభూమియు దాని పరిస్థితులును చాలా విధములుగ మార్పులు గలుగ జేయుచున్నవి.

## ప్రశ్నలు.

1. మీగ్రామములో ఇండ్లు వేనితో కట్టబడినవి? ఏల?
2. మీగ్రామములో జనుల ముఖ్యవృత్తులు చెప్పుము? ఎందువలన వారా వృత్తులు ఏర్పరచినారు?
3. నీవు తినే ఆహారవస్తువులేమి? దొరలు తినే వస్తువు లేమిటి?

## అధ్యాయము VII.

### రాకపోకలమార్గములు_రైలుమార్గము, పడవ, బండి.

నీవు స్కూలునకు ప్రతిదినము నడచి వచ్చుచున్నావు గదా! ఒక దినమున కాలు నొప్పిగా వుండిన బండిఎక్కివచ్చెదవు. బండిని యెద్దులు లాగును. మనము మనయొక్కసుఖము కొరకు బండ్లను ఏర్పాటు చేసికొంటిమి. మనము నివసించు ఒక గ్రామమునుండి ఇంకొక గ్రామము పోవుటకు గాను బాటలు



ఏర్పాటుచేసినారు. ఈబాటలు మట్టితోను, రాళ్ళు, కంకర తోను వేయుచున్నాము. వీనిపైన బండ్లు నడుచును. నీగ్రామ



వలవలన పడవలమీంద ప్రయాణముచేయుటయే ముఖ్య యుప యోగముకాదు. కాలువలోని మంచినీరు చుట్టు ప్రక్కలనున్న పొలములకు పెట్టుకొని పంటలు పండించుకొందుము. కనుక కాలువలను, సమీపమున మంచిసారవంతమగు భూములు గలిగిన చోట్ల విశేషముగ త్రవ్వుచున్నాము. పడవలమీద అనేక వేల బస్తాలు, ధాన్యములు, బరువైన సామానులు చాలా చోట్లకు తీసికొని పోవుచున్నాము. మనము కాలువలు త్రవ్వునపుడు కూడా పై విషయములను బట్టియే త్రవ్వుదుము.

మనము కొండ ప్రదేశములలోనికి, అడవులలోనికి, మరియేప్రదేశములనైన దాటిపోవుటకుయిప్పుడు రైలుమార్గము



లున్నవి. వీని వలన యెంతదూరప్రదేశములకైనను ఏకాలమందైనను, శీఘ్రముగా ప్రయాణము చేయుచున్నాము. ఈరైలు మార్గములు వేయుటకు ఏమి కావలయును? ఇనుపకడ్డీలు కావలెను. బొగ్గు కావలయును. బండ్లు, ఇంజనులు కావలయును. ఇవన్నియు యితరదేశములనుండి మనకు వచ్చుచున్నవి. రైళ్లు ఎటువంటి ప్రదేశములలో వేయుదురు? వాని అవసరముఎచ్చట ఎక్కువగా నుండునో అచ్చట వేయుదురు. పెద్ద పట్టణములకు

అనేకమంది జనులు ప్రతిదినము వెళ్లుచుందురు. గొప్ప వర్తక వ్యాపారము గల ప్రదేశములలో సరకులు అధికముగా ఎగుమతి, దిగుమతి యగుచుండును. అట్టి ప్రదేశములందు చాలా రైలుమార్గములు వేసియున్నారు. అంతేగాని జనులు లేని ప్రదేశములలోను, సరకులు ఉత్పత్తిగాని ప్రదేశములలోను, రైలుమార్గములు వేయుటలేదు.

రైలు మార్గములకు, కాలువలకు, రోడ్లకు వర్తక వ్యాపార మార్గములని పిలచెదము. వీనిని మనుష్యులు ఆయా ప్రదేశములలోని వసతులను బట్టియు, పంటలు వర్తకమును బట్టియుపర్పాటులు చేయుచున్నారు. ఇవియునుగాక యిప్పుడు సముద్రముమీద బాగుగవర్తకముజరుగుచున్నది. పూర్వము కొయ్యతోచేసిన చిన్నినావ లేక యోడలుండెడివి. వానిపై ప్రయాణము అలస్యము. మనుష్యులకు, సరకులకు చాలాఅపాయము. ఇప్పుడు పెద్దపొగయోడలు గలవు. ఇవి పెద్ద పట్టణముల సమీపమున గొప్ప రేవులు కట్టబడిన ప్రదేశములనుండి సముద్రముపై ప్రయాణము చేయును. లోతులేని రేవులవద్దకు పెద్ద పొగయోడలు రాలేవు కనుక చాలా లోతుసముద్రముగల గొప్ప రేవుపట్టణములనుండివీనిపై వర్తకముజరుగుచున్నది.

ప్రశ్నలు.

1. మీ గ్రామములోని రోడ్లు ఎట్టివి? ఎల?
2. రైలులో ప్రయాణముచేయుచు యిరుప్రక్కల పంటలను వర్ణించుము.
3. పడవలో ప్రయాణము చేయుచు యిరుప్రక్కలను వర్ణించుము.
4. కాలువలు ఎటువంటి వసతులుండిన త్రవ్వుచున్నారము.




Rama & Co. Ellore

# గుంటూరుజిల్లా జాగ్రఫీ.

## రెండవ భాగము.

### అ ధ్యా య ము .

#### ఆకారము, పరిమాణము, ఎల్లలు.

మీరు నివసించు గ్రామమునకు, పట్టణమునకు, చుట్టు ప్రక్కలనుండు విశాలముగు ప్రదేశమునకు తాలూకాయనియు, ఇట్టి తాలూకాలు కొన్నింటిని చేర్చి జిల్లాయనియు పిలచుచున్నాము. జిల్లాయను ప్రదేశము సహజముగ ఏర్పడినదిగాదు. దానిని మనుష్యులే ఏర్పాటు చేసినారు. అట్లుఏర్పాటుచేసి ఆప్రదేశమునకు చుట్టును సరిహద్దులు గీయుచున్నారు. నీవు మీ జిల్లాపటమును పరీక్షింపుము. ఆజిల్లాపట మెట్లున్నది? ఆకారముచూడుడు. ఉత్తరమున అర్ధసున్నఆకారముగనున్నది. ఈఅర్ధసున్న ఆకారముగా కృష్ణానది ప్రవహించు చున్నది. మిగిలినభాగము చూడుడు? ఇరుప్రక్కలను సన్ననై దక్షిణమునకు కొనదేలినది.

అట్టి యాకారముగల వస్తువును పేర్కొనుము. బొంగరమును చూడుడు. దాని యాకారమును బోలి మన జిల్లా ప్రదేశము గలదు. బొంగరము పైభాగమువలె మన జిల్లా కుత్తరమున కృష్ణానది యున్నది. ఒక ప్రక్క సముద్రమును

మరియొక ప్రక్క సరిహద్దు గీయఁబడినది. కనుక మన జిల్లాకు ఒక పడమటి ప్రక్క తప్ప తక్కిన భాగమునందంతయు సహజముగా ఇతర జిల్లాలనుండి వేరుచేయబడి యున్నది. ఈప్రదేశమునకు గుంటూరు అను పట్టణము ముఖ్యస్థానము. కనుక దీనికి గుంటూరు జిల్లాయని పేరు. ఒక కాగితముతో ఒకయరసున్న ఆకారమును, ఒకత్రిభుజమును కత్తిరింపుము. ఒకదానిపై నొకటి యమర్చి మన జిల్లా పటమును బోలియున్నదేమో చూడుము. దీనియందు మనజిల్లా చుట్టునుండు సరిహద్దుల పేర్కొనుము.

ఈ ప్రదేశము పటములోకనుపడునట్లు చిన్నప్రదేశము గాదు. చాల విశాలమైన ప్రదేశము. దీనియొక్క ఉత్తరపు కృష్ణానదియొక్క వంపు సుమారు 300 మైళ్ళున్నది. తూర్పు నుంచి పడమరకు 115 మైళ్ళు పొడవు. ఉత్తర దక్షిణములుగా దూరము 100 మైళ్ళు. ఇది చిన్న స్కేలుతో మీ పటములో వేయబడినది. దీని వైశాల్యము 5735 చదరపు మైళ్లు. ఈ జిల్లాచుట్టునుండు ప్రదేశములను, సరిహద్దులు లేక ఎల్లలు అని పిలుతుము. మన జిల్లాపటము తిరిగి పరిశీలింతము. ఎల్లలు చెప్పుము. ఉత్తరమున కృష్ణానది, దానికి ఆవల కృష్ణాజిల్లా, హైదరాబాదు అను పేరుగల నిజాంరాజ్యమున్నూ, తూర్పున కొంతవరకు కృష్ణానది, కృష్ణాజిల్లాయును, పిమ్మట సముద్రము ఉన్నవి. ఈసముద్రమునకుబంగాళాఖాతమని పేరు.



దక్షిణమున నెల్లూరుజిల్లాయున్నది. పడమట కర్నూలుజిల్లాయును, కృష్ణానదియు నిజాంరాజ్యములున్నవి. ఈ సరిహద్దులనుబట్టి, ఏయే దిక్కులందు ఏరాజ్యభాగములు, ప్రదేశములు గలవో చెప్పుము.

### ప్రశ్నలు.

1. మీ జిల్లా ఆకారమును గీయుము.
2. అందు ఎనిమిది దిక్కుల పేర్లు వ్రాయుము.
3. ఈ జిల్లాపటమును బోలిన నేలయందు పటమును తయారు చేయుము.
4. మీ జిల్లా ఎంతవరకు సహజమైన ఎల్లలు గలిగి యున్నది? ఎంతవరకు మనుష్యులు గీసిన సరిహద్దులవలన వేరగుచున్నది.
5. జిల్లా విస్తీర్ణము ఎంత?

## అధ్యాయము II.

### సహజస్వరూపము, సహజభాగములు.

క్రిందటి ప్రకరణములో చెప్పిన సరిహద్దుల నడుమ గల ప్రదేశముయొక్క ఉపరిభాగమును వర్ణింతము. ఈ ప్రదేశమంతయు సహజముగా ఒకేరూపమున లేదు. దీనికే నైసర్గిక స్థితియనికూడ అందుము. దీనిపై భాగము కొంతవరకు చదునుగను, పల్లముగను, కొంతవరకు మిట్టభాగము కొండలతోను, నిండియున్నది. కనుక ఈపటమును పరిశీలించుడు. అందుకొంత జలభాగము సూచించును. కొంత చదునైన మైదానమును సూచించును. అట్టి మైదానము మనజిల్లాలో తూర్పుభాగమంతయు సముద్రము నానుకొని దక్షిణమున చీలికగా సన్నగను






ఉత్తరమునకు వెడల్పుగను వ్యాపించి యున్నది. దీనికి తీర మైదానమని పేరు. ఇదియొక సహజభాగము. సముద్ర మట్టమునకు విశేషఎత్తులేదు. ఇది చదునైన మైదానము.దీనికిపడమటనున్న ప్రదేశమును పరిశీలించుడు. ఇదియొక మిట్టభూమి. పీఠభూమిలోని భాగము. అంతయు కొండలతోను గుట్టలతోను నిండి, మెరకపల్లములుగా నున్నది. ఇది పడమట 600 అడుగుల వరకు ఎత్తుననున్నది. అంతయు తూర్పునకు వాలియున్నది. ఇది పీఠభూమి భాగము రెండవది సహజభాగము.

1. పీఠభూమి భాగము:—ఇది యీ జిల్లాలోమూడవ వంతు ప్రదేశ మాక్రమించుకొని యున్నది. ఇది కృష్ణానది నానుకొని ఎత్తున వ్యాపించియున్నది. పడమట ఎత్తైనకొండలు గలవు. ఈ గుట్టలన్నింటికిని తూర్పు కనుమలని పేరు. ఇవిఆరు చోట్ల గుంపులుగా నున్నవి. పడమటనున్న గుంపునకు పల్నాటి కొండలనియు, ఉత్తరమున బెల్లంగొండ, శీతానగరం మంగళగిరి కొండలనియు, మధ్యను కొండవీడు కోటప్పకొండలనియు నైఋతిమూల వినుకొండకొండలనియు, దక్షిణమున చీమకుర్తి కొండలనియు పేర్లు.వీనినిపటమునందు గురుతించుము. వీనిలో పల్నాటికొండలు, చీమకుర్తికొండలు మిగులఎత్తైనవి. మిగిలినకొండలుగుట్టలుగుట్టలుగా1000అడుగులలోపుగా నున్నవి. వీనినావరించియుండు భూమి అంతయు పీఠభూమి. వీనియందు కొండవాగులు కొన్ని పుట్టుచున్నవి. ఇవి చాలచిన్నవి.చంద్ర

వంక, నాగులేరు పల్నాటి కొండలలో పుట్టి కృష్ణానదిలో కలియుచున్నవి. ఇవి బహువడిగా ఒకటి రెండు నెలలు మాత్రమే ప్రవహించును. వీనిలో చంద్రవంక పెద్దది. ఇది స్త్రీలు తలలో ధరించు చంద్రవంకవలె వంపుగానుండుటచే దీనికీపేరు గలిగినది. ఉత్తరమున బెల్లంకొండ సమీపమునగుట్టలలో బీరవల్లిపాయ, ఎద్దువాగు, అనురెండు వాగులుపుట్టి కృష్ణానదిలోపడుచున్నవి. ఇవియును స్వల్పవాగులే. మరియును పడమట, కర్నూలు జిల్లాలో తూర్పుకనుమలలోని నల్లకొండలలో పుట్టి మన జిల్లా ఆగ్నేయమూలనున్న వినుకొండ కొండసమీపముగాపారుచు చీమకుర్తి కొండలగుండా దారిచేసికొని బంగాళాఖాతమున చేరుచున్న ఒక చిన్న నది గలదు. దీనికే గుండ్లకమ్మనదియని పేరు. ఇది సుమారు 100 మైళ్ళ నిడివి గలది. ఇది చాలా భాగము పీఠభూమి భాగముగుండా ప్రవహించును. దీనియందు నీరు ఒకటి, రెండు మాసములు పూర్తిగా ప్రవహించును. ప్రవాహవేగము చాల ఎక్కువ. దీని వెడల్పు ఒక ఫర్లాంగుండును. దీనియందు గుండురాళ్లు విశేషముగనుక ఈపేరు కలిగినది. ఈ నది ప్రవహించు మార్గమును బట్టి యీ పీఠభూమి భాగము ఎట్లు వాలినదో గమనించుము. కొంచెము ఆగ్నేయమూలగ వాలినది.

2. తీరమైదానము:—ఇది సమమైన భూమి. దక్షిణమున సుమారు 20 మైళ్ళువెడల్పుగను, ఉత్తరమున 50 మైళ్ళ వరకువెడల్పునుగలిగియున్నది. దీనియాకారముపటమునగమనిం



చుము. ఇదియును సముద్రములోనికి వాలియున్నది. దీనియందు రాళ్ళు, కొండలు లేవు. చాలభాగము రేగటి యిసుకనేల. ఇందు రెండువాగులు వినుకొండ తాలూకాలోని కొండల సమీపముగ పుట్టి బాపట్ల చెరువునందు పడుచున్నవి. ఈ చెరువు చాల పెద్దది. ఈవాగులు, నల్లమడ, నల్లవాగు, అని పిలువబడును. ఇప్పుడు యీ చెరువులో చాలా భాగము దిబ్బయగుటచే వ్యవసాయము చేయుచున్నారు. ఈ మైదానము యొక్క ఉత్తరభాగము కృష్ణానది డెల్టాను ఆనియున్నది. కృష్ణానది చాలపెద్దనది. అది మనజిల్లాకు పడమటినుంచి 300 మైళ్ళు చుట్టివచ్చును. ఈనది మొత్తపు నిడివి సుమారు 650 మైళ్ళు. ఈనది తూర్పున శాఖలై బంగాళాఖాతమున కలియుచున్నది. ఈనది ముఖద్వారమున కలియుప్రదేశమునకేడెల్టాయందురు. ఇచ్చట నది సుమారు రెండుమైళ్ళు వెడల్పుగలదు. ఈమైదాన ప్రదేశమునకు పడమట కొంచెము ఎత్తుగానుండి పీఠభూమి భాగముతో గలియును. మనజిల్లాలోని రెండుభాగములకు వేరువేరువిధముల సహజస్వరూప ముండుటచే వీనినిసహజభాగములందురు. వీనికి ఒక ఆకారమునందే గాక అన్నిపరిస్థితులయందును భేదములు గలవని ముందు మీరు నేర్చుకొందురు.

## ప్రశ్నలు.

1. మీజిల్లాలో సహజస్వరూపమును బోలిన బంకమట్టితో సహజ భాగములు సూచించుచు పటము తయారు చేయుము.

2. తోటలోను పటములోకూడను ఎత్తుపల్లములుచేసి కొండలు, గుట్టలు వానివాని స్థానములం దమర్చుము.

3. సహజభాగములకు గల భేదములు, వానియందు నదులు కొండలు వర్ణింపుము.

4. దీని నేల సహజభాగము లంటివు.

## అధ్యాయము III.

### శీతోష్ణస్థితి సహజభాగములందు గల భేదములు.

మన జిల్లాయందు రెండు సహజభాగము లున్నవిగదా వీనియందు శీతోష్ణస్థితి ఎట్లుండునో విచారించెదము. మనమిది వరలో సంవత్సరములో నెన్ని ఋతువులుగలవో ఆ కాలము లందు శీతోష్ణభేదము లెట్లుండునో చూచితిమి. మన జిల్లా మొత్తముమీద ఉష్ణప్రదేశము. సూర్యుని వేడిమి జాస్తిగా అన్నిచోట్లనుండును. అయినను రెండు సహజభాగములందు వేరువేరు విధములుగా నున్నది.

i. మీరభూమి భాగము:—ఇందు పగటికాలము నందు వేసవికాలమున సూర్యుని వేడిమి మిగుల జాస్తి. సూర్యుని కిరణములు అతి తీక్ష్ణముగ ప్రసరించి, ప్రదేశమును మాడ్చి వేయును. కొంచెము ప్రొద్దెక్కసరికి, పడమటనుంచి అతివేడి యైన భూమిమీదనుండి వీచెడు గాడ్పులువీచును. ఇవి వేడిమిని మరింత మిక్కుటము చేయును. ఇట్లు వేడిమి సూర్యుడస్తమించిన వెనుక రాత్రి చాలభాగము వరకు నుండును. కొంచెము తగ్గుసరికి తిరిగి సూర్యు డుదయించి వేడిమి హెచ్చును. ఇట్లు





మార్చి నెల మొదలు సెప్టెంబరు నెలవరకు వేసవికాలము మిక్కుటమైయుండును. పిమ్మట రెండు నెలలు కొద్దిగా వర్షములు కురియును. ఈవర్షములు సరిగా భూమిని తడుపలేరు. వర్షము బోరున ఒకటి రెండు సార్లు కురియును. పిమ్మట డిశంబరు మొదలు కొని పగటికాలమందునగూడ చలి గాలులు భూమిపై నుండివీచును. చలి విశేషముగ నుండును. సూర్యకిరణములున్నను పడమటి నుంచి శీతగాలులు వీచును. రాత్రిపడగానే శీతగాలులు బాగుగ వీచి చలిబాధజాస్తి చేయును. ఇట్లు చలికాలమందీ గాడ్పులచే అమిత శీతలముగ నుండును.

2. మైదానభాగము:—ఇచ్చట వేసవికాలమున పగలు సూర్యకిరణములు వేడిమిగ నుండును. కాని పడమటి వేడి భూమి గాలులుండవు. మధ్యాహ్నము 3 గంటలగుసరికి చల్లని సముద్రపు గాలులు భూమిపైకి వీచును. కనుక సూర్యాస్తమానముతో వేడిమి తగ్గును. రాత్రులందు గూడ చల్లని గాలుల వలన వేడిమి తోచదు. కనుక వేసవికాలమునందు వేడిమి మితముగా నుండును. చలికాలము రాగానే తిరిగి సముద్రముమీద నుండి గాలులు వీచును. ఇవి చలిని మిక్కుటముచేయును. ఇవి వెచ్చని గాలులు. కనుక చలికాలమందు చలియును మితముగ నీ భాగమందుండును.

ఇట్లుండుటకు కారణమేమి? పీఠభూమి భాగము చూడుడు. దాని చుట్టు ఎంతదూరము చూచినను భూభాగమే కదా! దీనికి ఏకాలమందైనను ఏ ప్రదేశమునుండి గాలి వీచును? భూభాగము మీదనుండియే. మైదానభాగమును చూడుడు. దీనికి సమీపమున విస్తారమగు జలప్రదేశము, బంగాళాఖాతము న్నది. కనుక యీప్రదేశమునకు సముద్రపుగాలులు వీచు చుండును. సముద్రపుగాలులకు భూమిపై వీచుగాలులకు భేదమేమి? సముద్రపుగాలులు వేసవికాలమున చల్లగనుండును. భూమిగాలులు వేడిగానుండును. ఏల? ఒకరోజున నీవు ఎండలో ఒక చెంబునిండ నీరును, ఒక రాతిని ఒక గంట సేపుంచుము. తర్వాత రెంటియందు చేయినుంచుము. రాయి మిగుల వేడి ఎక్కును. నీరు చల్లగనే యుండును. గనుక భూమి, జలముకంటె తొందరగా వేడిమి ఎక్కును. కనుకనే భూమిమీదనుంచివచ్చు వేసవికాలపు గాలి మిగుల వేడిగను సముద్రపుగాలి చల్లగను నుండును. అట్లే ఒక చెంబునిండ వేడినీరును ఎఱ్ఱగా కాలుచున్న రాతిని నీటిలో గొంచెము సేపుంచి చూడుము. నీరు వేడిగానే యుండును గాని రాయి చల్లబడును. కనుక భూమి, జలముకంటె మిగుల వేగముగ చల్లబడును. కనుకనే భూమిమీద నుంచి వచ్చు చలికాలపు గాలి మిగుల శీతలముగను, సముద్రపుగాలి వెచ్చగను ఉండును. కనుక సముద్రమునకు సమీపప్రదేశములలో శీతోష్ణస్థితికి జలశీతోష్ణస్థితి యందురు. అట్లే భూభాగముతో చుట్టబడియుండులోతట్టు ప్రదేశములకు ఖండశీతోష్ణస్థితి యందుము. ఖండశీతోష్ణస్థితిగల దేశములో వేడిమియు చలియు మిక్కుటము. జలశీతోష్ణస్థితి గలచోట్ల రెండును మితముగ

నుండును. ఎట్టి స్థితినీకు ఇష్టము? ఏల? మన జిల్లాయందు రెండు సహజభాగములయందు రెండు విధముల శీతోష్ణస్థితి యున్నది. పటమునందు చూడుము. పీఠభూమియందు ఖండశీతోష్ణస్థితి; తీరమైదానమందు జలశీతోష్ణస్థితియున్నది.

### ప్రశ్నలు.

1. పీఠభూమి భాగమునందు వేసవికాల మెట్లుండును?
2. వేసవి కాలమున వీచు భూజల పవనముల భేదములేమి?
3. జలశీతోష్ణస్థితియని యెందుకు పిలుచుచున్నాము?
4. వేడిమిని గ్రహించుటలో భూమికిని జలమునకును భేదములేమి?
5. మీజిల్లాయందు యే భాగములో శీతోష్ణస్థితి నీకు ఇష్టము? ఏది నీకు సుఖముగా నుండును? ఏల?

## అధ్యాయము. IV.

### సహజభాగములలోని వర్షములు.

గుంటూరు జిల్లాలో వర్షమెట్లు ఏయేకాలములందుగురియునో విచారింతము. ఈ జిల్లా మొత్తము మీద విశేష వర్షము గురియు ప్రదేశముగాదు. మరియు సహజ భాగములయందు వేర్వేరు విధముల వర్షించును.

1. పీఠభూమి:—ఇందు వర్షము చాల తక్కువ. సెప్టెంబరు, అక్టోబరు నెలలయందు వర్షములు కురియును. బోరున వర్షములు సంవత్సరములో నాలుగైదుదినములుండును. ఈవర్షమునీరు చాలా భాగము ఎండియే పోవును. ఈవర్షము సంవత్సరమునకు 10 లేక 15 అంగుళములు మాత్రమే యుండును.



2. తీరమైదానము:—ఇందు ఎక్కువ వాన కురియును. జూలై మొదలు డిశెంబరు వరకు సుమారు 4 లేక 5 నెలలు వర్షించుచుండును. జూలై మొదలు రెండునెలలు సముద్రము మీదనుండి నైరుతి గాలులు వీచి బాగుగవర్షించును. అక్టోబరు మొదలు 3 నెలలు ఈశాన్యమూలనుండి సముద్రపు గాలుల వలన వర్షములు బాగుగకురియుచుండును. కనుక తూర్పు ప్రదేశమున బాగుగ వర్షమును పడమటి భాగములందు వర్షము తక్కువగను కురియును. సహజభాగములలోని వర్షమానములో భేదము బాగుగ గమనించుము. ఇచ్చట మైదానములో నీరు విశేషము ఇంకిపోనేరదు. నేలలో పైభాగమునే నీరు, చెమ్మ హెచ్చుగ నుండును.

### ప్రశ్నలు.

1. గుంటూరు జిల్లాయందు వర్షమే భాగమందెక్కువ కురియును? ఏల?
2. తీరమైదానమందెప్పుడు విశేషవర్షము కురియును?
3. పడమటిభాగమందెంత వర్షమే కాలమందు గురియును?

## అధ్యాయము V.

### నేలయొక్క స్థితి, నీటివసతి.

గుంటూరుజిల్లా యొక్క సహజస్వరూపము, శీతోష్ణస్థితి వర్షమును గురించి చదివితిరిగదా? ఇప్పుడు ఈ జిల్లాలోని భూమియెట్లున్నదో పరిశీలింతము. అనగా ఇచ్చటినేలయంతయు రాతినేలయా, బంకమట్టి నేలయా, యిసుక నేలయా, గులక

రాతినేలయూ, యని కనుగొనవలెను. మన జిల్లాయంతయు ఒకే విధమగు నేల లేదు. సహజభాగము. లందు నేల వేరు వేరు విధములుగా నున్నది.

1. మీద భూమి:—ఇచ్చట నేలయంతయు ఎరుపుమన్ను, గులకరాయి, పెద్ద రాతిబండలతోను విశేషము నిండియున్నది. కొన్ని భాగములందు నల్లరేగడ ప్రదేశమున్నది. ఈ నేలఫల వంతమైనదిగాదు. సారములేదు. నేలలోనికి నీరు ఇంకదు. విశేషములోతుపోదు. త్వరలో ఎండిపోవును. నల్లరేగడప్రదేశములు ప్రత్తిపండుట కుపయోగించును.

2. మైదాన ప్రదేశము:—ఇది తీర ప్రదేశము లందు ఇసుకతోను, మిగత భాగమంతయు మన్ను సారవంతమగు రేగడి, ఒండుమట్టితోను నిండియున్నది. ఇది చాల ఫలవంతమైనది. ఇందు నీరుచాలలోతునకుదిగిపోవును. ఇదిచాలకాలము నీటిని లోపల దాచుకొనును. మీరు పొలములలో నడచి చూడుడు. నేల పగుళ్ళుగా నుండును. వీనికి నెరియ లందుము. ఎక్కువ వెడల్పు, మిగుల లోతుగా నెరియలు బడిన నేల మిగుల ఫలవంతమైనది. దీనిలో నీరు లోతునకు దిగును. చాల కాలముండును. ఇసుకనేల అంత ఫలవంతమైనది గాదు.

ఈప్రదేశములలో గల నీటివసతులను వివరించెదము. నీరు ఎట్లు ప్రవహించును? మెరకనుండి పల్లమునకే గాని పల్లమునుండి మెరకకు వెళ్ళదుగదా. మనజిల్లానేల ఎట్లు



వాలియున్నది? పడమటి నుండి తూర్పునకు వాలు గనుక విశేషము నీటివసతులుతూర్పుననే యున్నవి. ఇచ్చటినేల సమమైనది. నీరు చక్కగా ప్రవహించును. పడమటి భాగము మిట్ట పల్లములు. నీరు కొన్ని గుంటలలో నిలచును. కొన్నిచోట్ల మిగుల నడిగ బారును. కనుక నీటి వసతులయందుగూడ సహజభాగములందు భేదము గలదు.

1. మీద భూమి:—ఇందు నీరు నేలలలోనికిదిగదు. విడిగా వాగులుగా ప్రవహించును. ఈ వాగులును, ప్రవాహములును, పల్నాటి కొండలలోపారి, కొన్ని పెద్దవాగులందు చేరి, కృష్ణానదిలో బడును. మరికొన్ని వాగులు కొన్ని చెరువులలోచేరును. వీనియందు నీరు రెండు నెలలుండును. కనుక యీప్రదేశమంతయు నీటి యిరవులు, చెరువులు గనుక యీ భాగములందు విశేషముగా చెరువులుండును. వీనియందు నిలువయగు నీరు సంవత్సరమంతయు చాలును. వర్షములు తగ్గిన సంవత్సరమందీ భాగములందు నీటికొరకు చాల యిబ్బంది గలుగును. చెరువులు ఎండిపోవును. బావులు 60 లేక 70 అడుగుల లోతుండును. అవియును ఎండిపోవును. కనుక యీభాగములలో నీటి వసతులు చాలా తక్కువ.

తీర మైదానము:—ఇది బంకమట్టినేల. సమమైనప్రదేశము. వర్షముచాలయెక్కువ. నీరునేలపైభాగమందేయుండును. బావులు లోతేయుండవు. ఎక్కడ చూచినను మంచినీటి

యిరవులు గలవు. కనుక చెరువులులేవు. అయినను కృష్ణా డెల్టాను ఆనుకొని యుండుటచే, కృష్ణనీరుఅనేక కాలువలగుండా యీప్రదేశములో ప్రవహించును. కనుక మంచినీటివసతి చాల యున్నది. బావులు చాలగలవు. ఒక పెద్దచెరువు బాపట్ల వద్ద నున్నది. ఇందు పీఠభూమినుండి రెండువాగులు చేరుటచే నిది మిగుల పెద్దదిగనుక యీసహజ భాగమునందు నీటివసతి చాల యెక్కువగా నుండును.

### ప్రశ్నలు.

1. పీఠభూమియందేల విశేష చెరువులున్నవి ?
2. మన జిల్లాలో బెట్ట ప్రదేశ మేది ? ఏల ?
3. తీరమైదానములోని నీటి వసతులు వర్ణింపుము ?

## అధ్యాయము VI.

### అచ్చటి జనులు పండించు పంటలు, లోహములు, జంతువులు.

మన గుంటూరు జిల్లాయందలి సహజమగు పరిస్థితులు వర్ణించియున్నాముగదా. ఇచ్చట నివసించు జనులు యీవసతులను ఎట్లు తమ లాభముకొరకు ఉపయోగించుచున్నారు. నీదొడ్లోగాని, తోటలోగాని, మంచినీటి బావి యున్నను ప్రక్కన మంచి ఒండునేలగాని, పాటినేలగాని ఉండిన నీ వేమిచేయుదువు ? కూరగాయల పాదులు పెట్టుదువు. మంచి కూరలు గాయును. నీవు వానిని రుచిగా తిందువు. అట్లే అందరును తమ చుట్టునుండు ప్రదేశమును, అచ్చటి వసతులు బాగుగ విచారించి దానికి అనువైన పంటలు పండింతురు.





ఏప్రదేశములోనైనను పంటలు దేనినిబట్టి భేదించును? నీ తోటలో వరిమొక్కలు వేసిన పండునా? పండవు? అట్లే మొక్కజొన్న వేయుము. బాగుగపండును. నీరుపోయనిచో పండునా? పండవు. కనుక పంటలు అచ్చటి నేలస్థితినిబట్టియు, శీతోష్ణస్థితిని బట్టియు, వర్షమును బట్టియు, నీటివసతులను బట్టియు మారుచుండును.

1. నేలస్థితి:—కొన్ని నేలలు ఎఱ్ఱమట్టితోను, రాతితోను నిండియుండును. ఇవిసారహీనములైన నేలలు. ఇచ్చట నేలనుంచి బలముకావలసిన పంటలు పండవు. కాయధాన్యములు అనగా కంది, పెసర, మినుము, నువ్వు, ధనియములు, జొన్న, వరిగ, సజ్జ, రాగులు పండును. ఇట్టి నేల మన జిల్లాయందే సహజభాగమున గలదు? పీఠభూమియందే గదా? కనుక యిచ్చట నీపంటలు పండగలవు. కొన్ని నేలలు మంచి ఒండుమట్టి, రేగడ, పాటిమన్నుతో నిండియుండును. ఇవి మంచి సారవంతమగు బలముగలనేలలు. ఇవి వరి, చెఱకు, పొగాకు, పసుపు జనుము, మొదలగు పంటల కనుకూలముగా నుండును. ఇట్టి నేల మనజిల్లాయం దేభాగమందున్నదో చూడుడు? తీరమైదానమందుగదా? కనుక యిచ్చట నీపంటలు పండును. కొన్ని నేలలు యిసుకతో నిండియుండును. ఇందు సముద్రతీరములందు, కొబ్బరి చవుకు (సరకు చెట్లు), వేరుశనగ; జీడిమామిడి మొదలగు చెట్లు వృద్ధిజెందును. ఇట్టి నేల మన జిల్లా తీరభాగమంతయును కనుబడుచున్నది.



2. శీతోష్ణస్థితి:—మిగుల వేడి ప్రదేశములలో పండు పంటలు చలిప్రదేశములలో పండవు. వరిపంటకు ఎండ కావలయును. గోధుమలు చల్లని ప్రదేశములోనే పండును. మీ దొడ్లో కాఫీగింజ నాటుము. పండునా? లేదు. దానికి చాలా శీతల ప్రదేశము కావలెను. మన జిల్లా అంతయును ఉష్ణప్రదేశము. సూర్యుని వేడిమి చాలా హెచ్చుగనే యుండును. కనుక ఏసహజభాగములోనైనను వేడి ప్రదేశము పంటలే పండును.

3. వర్షము:—నీటి ఆధారము కొన్నిపంటలకు ఎక్కువగనుండవలెను. కూరగాయలుమంచి వర్షకాలములోనేబాగుగ ఫలించును. ఎండకాలమునీవుఎన్నినీళ్ళుపోసినను ఎండును. కనుక మంచివర్షముగల తీరమైదానమందు పండు పంటలు పీఠభూమియందు లేవు.

4. నీటివసతి:—కొన్ని పంటలకు నీరు ఎడతెగక పారుచుండవలెను. వరిపండు పొలములలో ఎల్లప్పుడు మోకాళ్ళలోతు నీరుండవలెను. కొన్నింటికి కొద్ది నీరుండిన చాలును. జొన్న, వరిగ, కాయధాన్యములకును చెరువులలో నీరు చల్లినను చాలును. కనుక మంచినీటివసతి కాలువలుద్వారాతూర్పు తీరమైదానమందున్నదిగాని పీఠభూమియందు లేదు. కానతీరమైదానమందు పల్లపు పంటలును, పీఠభూమియందు మెట్టపంటలును పండుచున్నవి.

1. వరి:—దీనికి పల్లపునేల, మంచిఎండ, విశేషజలము, ఒండుమట్టి కావలయును. ఈవసతు లెచ్చటనున్నవి? తీరమైదాన

మందు త్తర భాగమున కలవు. కనుక నిచ్చట వరి ఎక్కువగ పండును. పటములో చూడుము. మరియు పీఠభూమి యందు కొన్ని చెరువుల గట్లక్రింద ఒండుభూములలో పండింతురు.

2. చెఱకు:—వరిపంటపండుచోట్లలో నేయిదిపండునుగాని నేలకుబలముచాలకావలెను.ఇదియునుతీరమైదానమునపండును.

3. పొగాకు:—ఇదియును తీరమైదానమున పండును.

4. కాయధాన్యములు:-ఉలవలు,కంది, పెసర,మినుము, చోళ్ళు, సజ్జలు, జొన్న, యివన్నియు మెట్టపంటలు ఇవి పండుటకు వేడిమికావలెను. నేలబలము విశేషము అక్కర లేదు. వర్షముకొంచెముచాలును.కనుకనివిపీఠభూమియంతయు పండును. చెరువుల సమీపమందు బావులనీటివలనను వర్షము వలనను పండింతురు.

5. తీరమునందు వేరుశనగ, కొబ్బరి, సరకు, జీడిమామిడి యును పండును.

6. ప్రత్తి:—ఈ జిల్లాయందు పీఠభూమియందనేక చోట్ల నల్లరేగడయున్నది. ఇది ప్రత్తికి చాలమంచినేల. దీనికి మంచి ఉష్ణము కావలయును. కొద్దివర్షము చాలును. మనజిల్లా లోనెచ్చట నీవసతులు గలవో చూడుము. దీని గింజనుండి నూనెతీయుదురు.

7. గోధుమలు:-ఈగింజలుసాధారణముగ చల్లనిప్రదేశములందేపండును. ఎండయు,వానయు అధికముకాకూడదు.అట్టి



భాగము మన జిల్లాలో యున్నదా? లేదు. అయినను అచ్చట చ్చటిబావులక్రింద పీఠభూమి భాగములలో కొండల ప్రక్క లందు చల్లగా నుండు చోట్లకొద్దిగా పండింతురు.

8. మిరపకాయలు, నువ్వులు:—ఇవియును మెట్టపైరులు. వీనిని పీఠభూమియందు సేద్యము చేయుచున్నారు.

9. నీలి:—ఇదియును నల్లరేగడ భూమిలో పండును. దీనిని కొద్దిగా పీఠభూమి ప్రదేశములయందు పండింతురు.

10. అడవులు:-మన జిల్లాయందు అడవులు విశేషముగ లేవు. ఇవి పీఠభూమి భాగములందుగల కొండలయందును తిప్పలయందును చాలవరకు గలవు. కాని వీనియందు విశేష దట్టమైన వృక్షములుండవు. వర్షములు తక్కువ. కనుక యీ అడవులయందు పశువులకు చాలా యాహారమును, కొద్దిగా కలపయును దొరకుచున్నవి.

మనజిల్లాయందు నేలలోపలినుండిత్రవ్వి యెత్తు వస్తువులు లేవు. ఇవి గనులందుము. ఇందుండియే యినుము, రాగి మొదలగు లోహములు వచ్చును. మన జిల్లాలో మంచి పలక రాయి దొరకును. పడమటనున్న కొండలయందీరాతిగనులు విశేషము గలవు. ఇతర గనులు లేవు.

మన జిల్లాయందు పశువులు మెండు. ఇవి చాల బలముగలవి. చాలబాగుగ పెరుగును. వీనికి మంచి బలముగు నాహారము నిచ్చు జొన్న, ప్రత్తిగింజలు, అడవులలో మేతయు

బాగుగ దొరకును. కనుక పల్నాడు మొదలగు పడమట భాగములలో మందలు మందలుగా పశువులను పెంచుదురు. దక్షిణ భాగమున వంగవోలు పశువులకు చాలా ప్రసిద్ధి. పూర్వము ప్రతిసంవత్సరము పశువుల సంత జరుగుచుండెడిది. ఈ పశువులను యిక్కడ నుంచి యితర దేశములకు మిక్కిలిగ గొనిపోవుచున్నారు. ఇచ్చట మేకలు, గొర్రెలు కూడ కొద్దిగా పెంచుచున్నారు. అడవులయందు విశేషముగా జింకలును, చిఱుతపులులు ఉన్నవి. కాని పెద్దపులులు అరుదుగా నుండును. జింకలను పట్టుకొని వాని కొమ్ములు, చర్మములను ఇతరచోట్లకు పంపుదురు.

## ప్రశ్నలు.

1. మీతోటలోని పటమునం దాయా సహజభాగములందు అచ్చట పండు గింజలను నాటుము?
2. కాగితపు పటముపై ఆయా పైరుల గింజలను అంటించుము.
3. పశువులకును, ప్రత్తికిని మనజిల్లా ఎందువలన ప్రసిద్ధి జెందినది?
4. వరి మన జిల్లాయందెచ్చట పైరగును? కారణములేమి?

# అధ్యాయము VII

## వ్యాపారమార్గములు, రైలు మార్గములు, రోడ్లు, కాలువలు.

మన జిల్లాలో జనులు ఒక చోటనుంచిమరియొకచోటికి వెళ్ళుటకును, పంటలను, ఉత్పత్తిపదార్థములను,ఒకచోటనుంచి మరియొకచోటుకు గొనిపోవుటకు అనేక మార్గములు ఏర్పాటు చేసియున్నారు. ఇవియును రెండు సహజభాగములలోని



పరిస్థితులను, పంటలను బట్టియు భేదించుచున్నవి. వీనిలో ముఖ్యములైనవి రోడ్లుగదా?

1. రోడ్లు:—మీరిదివరలో రోడ్లు వేయుటకు వసతులేవో నేర్చుకొనియున్నారు. మంచివర్తకము, మంచి కంకర, పని చేయుటకు కూలీలు బాగుగ దొరకినచో రోడ్లు నిర్మింతురు. కనుక మన జిల్లాయందు వసతులు గల ప్రతి పట్టణమునకు రోడ్లు వేసియున్నారు. పటమును చూడుడు. ఎక్కువగా రోడ్లు ఏ సహజభాగమున నున్నవి? పీఠభూమిలో చాల లేవు? ఏల? అచ్చటపంటలుతక్కువ. బెట్టభూములుగదా? మైదానమున చూడుము. రోడ్లుచాలగలవు. ఏల? విశేషముగాపంటలు, సమమైననేలయున్నదిగదా? రోడ్లయొక్క ఉపయోగము ఏసహజభాగమునందు ఎక్కువో చూడుడు. ఇట్టి పెద్దరోడ్లుఅనేకములు గలవు. వీనియందొక రోడ్డు తూర్పుతీరముననే బెజవాడనుండి, గుంటూరు, బాపట్ల, వంగోలు మీదుగా చెన్నపట్టణమునకు వేయబడియున్నది. దీనికిట్రంకురోడ్డు అనిపేరు. పటమునగుర్తింపుడు. దీనినుండి పడమట నరసారావుపేట, అద్దంకి, వినుకొండ, దాచేపల్లి, సత్తెనపల్లికి రోడ్లుకలవు. వీనినన్నింటిని పటమున గురుతించుడు. తూర్పున అనేకశాఖల రోడ్లున్నవి. సాధారణముగా ప్రతి గ్రామమునకు రోడ్లున్నవి. ఏల?

2. కాలువలు:—కాలువలు త్రవ్వుటకు వసతులు, కారణములు, యిదివరలో చదివియున్నారు. అవియేమి? చదునైన






సమమట్టమగునేల, త్రవ్వుటకు వీలగు మెత్తని నేల, మంచి నీటి యిరవు సమీపమున బాగుగ ఫలవంతమగు భూములుండవలెను గదా? ఇవి యుండిననే మంచి కాలువలు త్రవ్వుటకు వీలగును. పటమును పరిశీలింపుడు. మన జిల్లాయందే సహజ భాగమున నేవసతులుగలవో చూతుము. మీర భూమి భాగమునందు లేవు. మైదాన భాగమునందు విశేషముగా యీవసతులున్నవి. అవి వర్ణింపుము. కనుక నీభాగమందే విశేషముగా కాలువలున్నవి. దీనియందు వరి మొదలగు పంటలు ఎగుమతి యగుటయేగాక, జనులుకూడ ప్రయాణముచేయుదురు. ఈక్రిందిపటమును చూడుము. మన జిల్లాలో కాలువలు మైదానములో నెట్లున్నవో చూడుము. అవి కలియు కూడలిస్థానము బెజవాడ. ఇవి కృష్ణా నదినుండి త్రవ్వబడినవి. వీనిలో పెద్దకాలువలు మూడు.

1. బకింగుహాముకాలువ:- ఇది బెజవాడనుంచితీరప్రదేశముననే చెన్నపట్టణమువరకు పోవును. ఇదిసుమారు 300 మైళ్ల పొడుగు. దీనినుండి రెండుకాలువలుచీలుచున్నవి. ఒకటిబాంకు కాలువ. ఇది కృష్ణానది గట్టుననే సముద్రతీరమువరకు పోవుచున్నది. రెండవది నిజాంపట్టణపు కాలువ. దీనినుండిఅనేకపంటకాలువలు త్రవ్వబడియున్నవి. వీనివలన నీటివసతి బాగుగకలుగును.

3. రైలుమార్గములు:— రైలు మార్గములు వేయుటకు వసతులను గురించి నేర్చుకొనియున్నారు గదా! వర్తకమునకు విశేషవసతులు, జనసంఖ్య మొదలగు వసతులున్నవి.

తూర్పు తీరముననే గదా. పటమును చూడుడు. ఇందు రెండు పెద్ద బండి రైలుమార్గములున్నవి. ఇవి మద్రాసు దక్షిణమహారాష్ట్ర యిరుపదారి కంపెనీవారివి. ఒకటి గుంటూరు నుండి తెనాలి మీదుగా, రేపల్లె పోవుమార్గము. రెండవది బెజవాడ నుండి మదరాసునకు పోవుమార్గము. వీని పట్టాలను చూడుము. ఇవి పెద్దపట్టాలు. వీని మధ్య 5 అ 6 అం వెడల్పు కనుక బ్రాడ్ గేజీ అందురు. ఇవి రెండును మైదానభాగములోనున్నవి. దీనిపైననే సరకులు ఎగుమతి యగును. ఇచ్చట పండు వరి పసుపు, పొగాకు, వేరుశనగ, దీనిపైగొని పోబడును. పీఠభూమి గుండా ఒకటే చిన్న మార్గమున్నది. ఇది గుంటూరు మీదుగా గుంతకల్లునకు పోవును. ఇదియును పై కంపెనీ వారిదే. దీనిపట్టాలు చూడుము. చిన్నవి. వీని మధ్య 3 అ 3½ అంగుళముల వెడల్పు. ఈకొలతకు ఫ్రాన్సుదేశములో మీటరు అని అందురు. కనుక యీ మార్గమునకు మీటరు గేజీయందురు. ఇది పీఠభూమిలో అన్ని భాగములగుండా పోవునా? లేదు.ఏల? ఇవిబెట్టభూములు, పంటలు తక్కువ. దీనిపై ప్రత్తి మిరపకాయలు, కాయధాన్యములు విశేషముగ ఎగుమతి యగును. పటమును చూచి రైలుస్టేషనులు గుర్తుపెట్టుము.

### ప్రశ్నలు.

1. పెద్దరైలుమార్గములు ఎచ్చటనుండి వేయబడినవి? వీనిపై ఎగుమతి యగుపదార్థములేమి?



2. చిన్న, పెద్ద మార్గముల భేదములేమి?
3. బక్కింగుహాము కాలువ ఏయేభాగములనుండి పోవును? కారణమేమి?

## అధ్యాయము VII

### సహజభాగములలోని జనుల వృత్తులు, జీవితము ఆహారము, దుస్తులు, భాష, జనసంఖ్య.

ఇప్పుడు మన జిల్లాయందు జనులు ఏయే భాగముల యందు విశేషముగా నివసించుచున్నారో, ఏకారణము వలననో వారిజీవితములను వర్ణించెదము. మనజిల్లాలో జనులందరును ఒకేవిధముగు జీవనము చేయుటలేదు. ఒక భాగములో జనులకును మరియొక భాగములో జనులకును అనేకభేదములున్నవి. ఇవి వారు నివసించు ప్రదేశముయొక్క పరిస్థితుల వలన కలుగుచున్నవని గమనించ గలము.

1. పీఠభూమిభాగము :— ఇందు జనులు క్రిక్కిరిసియుండుటలేదు. గ్రామగ్రామమునకు 5 లేక 6 మైళ్లుదూరము. వీరిలో ననేకులు మోటువారు, మిగులబలాఢ్యులు. వీరు కొద్దిగా మెట్టపైరులను సేద్యముచేయుట, ముతుక బట్టలను నేయుట, రాళ్ళను పగుల గొట్టుట మొదలగు వృత్తులు గలవారు. చాలమంది పశువుల మందలను పెంచుచున్నారు. విశేష ధనవంతులుగారు. చాలమంది బీదవారు. అందరును కష్టజీవులే. వీరియాహారము వరిగ, సజ్జ లేక చోడిఅన్నము, దోస, ఆవకాయ. గోంగూర, పెరుగు, ఇవియే వారి నిత్యఆహా

రము. వారి దుస్తులు ముతుకబట్టలు. పెద్ద తలగుడ్డలు, పొడవైనకర్రలు, ధరింతురు. ఎంత దూరమైనను బాగుగ నడువగలరు. మోటువారు గనుక స్వచ్ఛమైన తెనుగు మాట్లాడలేరు. అయినను చాల మర్యాదగలవారు. నమ్మినవారిని మోసగింపరు. మంచిపేరులు. దైవచింతగలవారు. ఎందువలనయిచ్చట ప్రజలు యిట్లున్నారు? పరిస్థితులు చూడుము. పంటలేమి? దొరకు పదార్థములేమి? జనులు వీనినిబట్టియే తమజీవితములను, వృత్తులను ఏర్పాటుచేసికొనిరని గ్రహించగలుగుదుము.

2. మైదానభాగము:—ఇందు జనులు బాగుగ క్రిక్కిరిసియున్నారు 1 లేక 1½ మైళ్ళకొక గ్రామము వంతున అనేక గ్రామములు గలవు. వీనిలో ననేకులు బహునాగరికులు. అంతి బలవంతులుగారు. వీరి ముఖ్యవృత్తి పల్లపుభూముల సేద్యము చేయుట, వర్తకవ్యాపారము, ఫ్యాక్టరీలు మొదలగువాని నేర్పరచుట; చాలమందిధనవంతులు. అందరునుసుఖజీవులే. విశేషము కష్టపడలేరు. వీరు మంచి సన్నబియ్యము, అనేక రకములైన కూరగాయలతో నాజూకుగా ఆహారము తిందురు. మంచి సన్నని వస్త్రములను ధరింతురు. స్వచ్ఛమైన తెలుగుమాటాడుదురు. నవీననాగరిక దుస్తులధరింతురు. వీరికి విశేషవిరామము గలిగియుండుటచే పోట్లాటలు మెండు. అందువలన అనేక వ్యాజ్యములకు లోనై కోర్టులలో తిరుగుచుందురు. చూడుము. ఇచ్చటి జనులెట్టివారో? ఏల? వీరి పరిస్థితులు, దొరకు పదా



ర్థములు గమనించుము. వీరి దేశ శీతోష్ణస్థితిని పరిశీలించుము. ఈ పరిస్థితులవలననే యిక్కడి జనసంఖ్యమెండు. వీరి వృత్తులు జీవితము చాలా వేరుగా నున్నవి. మొత్తము మీద మనజిల్లా జనసంఖ్య 17 లక్షలు.

### ప్రశ్నలు.

1. తూర్పు మైదానములో జనులవృత్తులకును పీఠభూములలో వారివృత్తులకు భేదములేమి? కారణములను చెప్పుము.
2. పీఠభూమిలో వారి ఆహారమేమి?
3. మన జిల్లాలో ఏభాగమందలి జనులు ఎట్టిదుస్తులు ధరింతురు? ఏల?
4. నీవు మనజిల్లాలోని ఏభాగపు జనులను ప్రేమింతువు? ఏల?

## అధ్యాయము IX.

### ముఖ్యపట్టణములు, రేవులు, వానియుపయోగములు.

ఈ ప్రకరణములో మన జిల్లాలోని ప్రజలు, తమవర్తకమునకును, నివాసమునకు నిర్మించుకొనిన పట్టణములను గురించి రేవులను గురించి చదువనున్నాము. జనులు ఈజిల్లాయందనేక ముఖ్యపట్టణములను కట్టియున్నారు. పటమును చూడుము. అం దేసహజభాగమున విశేష పట్టణములు రేవులు కనుపించుచున్నవి? తీరమైదానమందున్నవి? ఏలనో మీకే తెలియును. ఇచ్చటి పట్టణములను వర్ణింతము.

1. పీఠభూమి భాగము:—ఈ భాగమునందు విశేష పట్టణములు లేవు. వీనియందు వినుకొండ, దాచేపల్లి, రెంట









చింతల, సత్తెనపల్లి, నరసారావుపేటఅను పెద్దపట్టణములుగలవు. ఇవి అన్నియు కొండల సమీప పట్టణములే. ఇచ్చటి ఇండ్లన్నియు మంచిరాతితో కట్టబడియున్నవి. ఈ పట్టణములకు మంచిరోడ్లు కలవు.

దాచేపల్లి:-ఇది పల్నాడుతాలూకాకు ముఖ్యపట్టణము. దీనికి రైలుమార్గము లేదు. చాలా పురాతనమైన పట్టణము. ఈ పట్టణమున గుడ్డలు నేత విశేషము. ఇదిపల్నాడుకు ముఖ్యపట్టణప్రాంతముగనుక నీప్రదేశపుపంటలన్నియు నీపట్టణమునుండియే ఎగుమతి యగును. ఇచ్చట పశువులు చాల విశేషముగా నున్నవి. ఇది చరిత్రలో చాల ప్రాముఖ్యమైనది.

వినుకొండ:—ఇది ఈ తాలూకకు ముఖ్యపట్టణము. దీనికి రైలు మార్గముకలదు. ఇచ్చటకూడ కొంచెము వర్తకము జరుగును.

నరసారావుపేట:—ఇది యొక పెద్ద పట్టణము. ఇచ్చట కొయ్య పనులు, కుర్చీలు, మంచములు, ఇనుప సామానులు, చేయుటకు ప్రసిద్ధి. ఇచ్చటకూడ కాయధాన్యములు, ప్రత్తి, మిర్చి, బాగుగ ఎగుమతి యగును.

2. తీరమైదానభాగము:—ఈ భాగమునందు పట్టణములు విశేషముగానున్నవి. ఇవిచాలధనవంతమయినవియును, విశాలమైనవియును, చాల జనసంఖ్య గలవియునైయున్నవి.

వీనియందు ముఖ్యము ఒంగోలు, బాపట్ల తెనాలి, చీరాల, గుంటూరు.

ఒంగోలు:—ఇది ఈతాలూకాముఖ్యపట్టణము. ఇచ్చట గొప్పవర్తకము జరుగును. కాయధాన్యములు, ప్రత్తి, విశేషము ఎగుమతి యగును. మంచి పశువులు ఇచ్చటనేయున్నవి.

బాపట్ల:—ఇదిపల్లపుప్రదేశములోనిపట్టణము. ఇచ్చట రైలుమార్గమున్నది. ఇచ్చటనుండి వేరుశనగ. బియ్యము మొదలగునవి ఎగుమతి యగును.

చీరాల:—గుడ్డలనేతకు చాల ప్రసిద్ధమైన పటణము.

తెనాలి:—ఈపట్టణము తీరమైదానములోకెల్లగొప్పది. ఇది పెద్ద రైల్వే కూడలిస్థానము. ఇచ్చట గొప్ప వర్తకము జరుగుచున్నది. జిల్లాలో పెరుగు ధాన్యములన్నియు యీ పట్టణము ద్వారా యితరచోట్లకు ఎగుమతి యగును. ఈ పట్టణములో కట్టడములును, ఇండ్లును చాలవరకు బంకమట్టితోను ఎండు వరిగడ్డితోను కట్టుదురు. మంచిరాతితో విశేషకట్టడములుండవు ? ఏల ? ఇచ్చట ఆపదార్థములు విశేషముగా దొరకును. రాళ్లు, పీఠభూమినుండి తేవలయును.

గుంటూరు:—ఇది పీఠభూమిలో కొనయందున్నది జిల్లాకు ముఖ్యస్థానము. గొప్పవర్తకస్థానము. ఇచ్చటనుండి ప్రత్తి, మిరపకాయలు, ధనియాలు, విశేషము ఎగుమతి యగును.



రేవుపట్టణములు:- మన జిల్లాకుతూర్పుతీరమందంతయు బంగాళాఖాతమున్నది. కాని విశేషలోతుగాలేదు. కనుక గొప్ప రేవులు లేవు. తీరమునందంతయు అనేక చిన్న పల్లెగ్రామములున్నవి. విశేషముగా చేపలుపట్టి జీవించువారు నివ



సింతురు. వీరు చిన్న దోనెలపై సముద్రముమీద రెండుమూడు మైళ్లుపోయి చేపలను పట్టుదురు. మిగుల ధైర్యస్థులు. తెగువ



గలవారు. పూర్వము పొగయోడలు లేవు. కొయ్యలతోను, తెడ్లతోను తెరచాపలతోను నడుపు యోడలు గలవు.

అప్పుడు యీతీరమందు రెండు గొప్ప రేవు పట్టణములుండెను:- 1 నిజాంపట్టణము, 2 కొత్తపట్టణము. ఈ పట్టణములు యిప్పుడు చిన్నపల్లెలు అయినవి. పూర్వపు ఓడవర్తకమునశించిపోయినది. ఈ రేవుపట్టణములను పటములో



[illegible]

గుర్తింపుము. ఇప్పుడు వర్తకము రైలుమీద జరుగుచున్నది. ఇచ్చటి రేవులు లోతులేవుగనుక పొగయోడలుసమీపింపలేవు.

### ప్రశ్నలు.

1. పీఠభూమియందును మైదానమందును గల పట్టణములకు భేదములేమి ? ఏల ?
2. మన జిల్లాలో రేవుపట్టణములేవి ? అవి క్షీణించుటకు కారణమేమి?
3. మీతోటలోని జిల్లాపటములో యీపట్టణముల స్థానములను గుర్తించి వాని యుపయోగములను తెలుపుము.

---

# గుంటూరుజిల్లా జాగ్రఫీ.

## మూడవ భాగము.

### పూర్వచరిత్ర.

### అధ్యాయము. I

#### వెంగిరాజుల అనంతర చరిత్ర.

పూర్వము అనగా షుమారు 2000 సంవత్సరముల వెనుక ఈ జిల్లాలోని ప్రదేశమంతయు చుట్టుపట్ల ప్రదేశమంతయును చాల వరకు అడవియైయుండెను. అప్పుడీ ప్రదేశములో నివసించు జనులను నిశంభుడను దానవుడు పాలించుచుండెనని పురాణగాథ కలదు. అతడు క్రూరుడైన రాక్షసుడు. జనులను సకల విధముల బాధించుచుండగా శ్రీకాకుళమునందు ఆంధ్ర మహావిష్ణువు అను మహావీరుడు సుచంద్రకుడను రాజునకుబుట్టి యాదానవుని సంహరించెను. కనుక నీతనిని ఒక దైవముగా యీజనులు భావించి ఆంధ్రులని పేరు పెట్టుకొనిరి. ఈతని రాజ్యమునకు ఆంధ్రరాజ్యమని పేరు. ఈతనివంశపు రాజులు ఇచ్చట గొప్ప రాజ్యము నేర్పరచి వెంగిపురమను గొప్ప పట్టణము కృష్ణానదికి ఆవల నిర్మించి, దానిని రాజధానినిగా జేసికొనిరి. కనుక నీరాజ్యమునకు వెంగి రాజ్యమని పేరు. వీరు రాజ్యము

చాలదూరాక మాక్రమింప జేసికొని మహావైభవముతో సుమారై నూరువందల సంవత్సరము లేలిరి. పిమ్మట వీరి క్షీణదశలో ఉత్తరదేశమునుండి సముద్రగుప్తుడను మహారాజు, గొప్ప శూరుడు, తన సైన్యముతో దండువెడలి యీ భాగములోని రాజుల నోడించి, వారిచే కప్పములను బొందెను. ఆయన మన జిల్లానుండి దక్షిణమున నెల్లూరివరకు వెళ్ళెను. అప్పుడు యీ ఆంధ్రరాజ్యము క్షీణించెను. ఇంతకు బూర్వము యీ ప్రదేశమందంతయు బౌద్ధమత సన్యాసులు వ్యాపించిరి. వీరు కనిష్కుడను ఉత్తరమున నేలు గొప్ప మహారాజుచే బంపబడి అనేక చోట్ల దేవాలయములను, స్థూపములను గట్టిరి వీనిలో ఇప్పటికిని వీరు కట్టిన స్థూపముల యొక్కయు దేవాలయముల యొక్కయు చిహ్నములు అమరావతిలోనున్నవి. వానిని పటములో గుర్తించుడు. మరియు ఇచ్చట త్రవ్వగా పూర్వపుఆభరణములు, పాత్రలు, ఆయుధములు దొరకినవి. అవి ఇప్పుడు మదారాసు మ్యూజియములో నుంచబడినవి. మరియుకృష్ణానదికి దక్షిణపు ఒడ్డున నున్న ధరణికోట యందును, అమరావతికి సమీపమున జగ్గయ్యపేట యందును, ఇట్టి స్థూపములున్నవి. వీనియందు రాళ్లపై అనేక విచిత్రములగు చిత్రపు పనులు చెక్కబడి యున్నవి. ఇవన్నియు ఆకాలమున సుప్రసిద్ధమైన పట్టణములు.

ఆంధ్రరాజ్యము క్షీణించిన వెనుక చాళుక్యులను రాజపుత్రులు యీ వెంగి రాజ్యము నాక్రమించుకొని 400 సం



వత్సరములు పాలించిరి. వారి కాలములో ప్రస్తుతము కోటప్పకొండయందలి దేవాలయములును, బెల్లంకొండ, కొండవీడు అను గొప్ప కొండ కోటలును, ఉండవల్లియందు గొప్ప గుహాలును కట్టబడినవి. వీరును తర్వాత కాకతీయ రాజులచే నోడింపబడిరి. తరువాత యీ రాజ్యము క్షీణించెను.

మనకు దక్షిణదేశములో చోళరాజ్యమను గొప్ప రాజ్యము సుమారు 900 సంవత్సరములక్రింద బాగుగ వృద్ధి నొందెను. ఆ రాజులలో శూరుడైన రాజరాజ చోళుడీదేశము నంతయు నాక్రమించుకొని 200 సంవత్సరములు అతని వంశీయులు రాజ్యముచేసిరి.

పిమ్మట ఇప్పటికి 500 సంవత్సరముల వెనుక విజయనగర రాజ్యమను గొప్ప రాజ్యము బయలుదేరెను. ఆ రాజులలో కెల్ల గొప్పకవి, శూరుడు, బహు ధర్మబుద్ధి గలవాడైన కృష్ణదేవరాయలు. మనజిల్లాలోని ప్రదేశమంతయు నాక్రమించుకొని, ఒంగోలులోని దేవాలయములుకట్టించెను. గొప్పకొండకోటలను వృద్ధిచేసి అనేక దేవాలయములు కట్టించెను. ఈతని రాజ్యము క్షీణింపగనే మహమ్మదీయులీ దేశముపై దండెత్తి దేవాలయములను శిధిలముచేసి మశీదులను కట్టించి చాల నాశనముచేసిరి. అప్పుడుయీదేశము గోల్కొండరాజ్యములో చేరినది. దీని నవాబులు మహమ్మదీయులు. ఆ కాలమునందే పల్నాటియందు అనేక ప్రభువులు, రెడ్డిరాజులును బయలుదేరి

ఒకరితో నొకరు పశువులకై తగాదాలు పడి తమ పౌరుషమును వెల్లడించిరి. ఈ రెడ్డి ప్రభువుల కాలమందు కొండవీడు బలమైన దుర్గము. వీరు సుమారు 300 సంవత్సరముల వెనుక పాలించిరి. పిమ్మట ఈ రాజ్యము హైదరాబాదు రాజ్యములో చేరి సుమారు 200 సంవత్సరముల క్రిందట ఇంగ్లీషు వారికి చేరినది. కనుక మన జిల్లా ప్రదేశము చాల సుప్రసిద్ధమైన చరిత్రగలది. అందులో ముఖ్యమైన పల్నాటి వీరుల కథలను ముందు ప్రకరణములో మీరు నేర్చుకొందురు.

### ప్రశ్నలు.

1. ఆంధ్రమహా విష్ణువు జేసిన పనులు వర్ణింపుము?
2. అమరావతి, ధరణికోటయందు పురాతనపు చిహ్నము లేమి యున్నవి? ఎప్పుడు నిర్మింపబడినవి.
3. కృష్ణదేవరాయలును గురించి నీకు ఏమి తెలియునో చెప్పుము.

## అధ్యాయము. II

### పల్నాటివీరులు, వారికథలు.

పల్నాడులో గురజాలను రాజధానిగా చేసికొనిఅనుగు రాజు పాలించుచుండెను. అతనిమంత్రి దొడ్డనాయడు. అనుగు రాజునకు ముగ్గురు భార్యలుండిరి. అనుగురాజు కొంతకాలము పాలించి చనిపోయిన వెనుక అతని కొడుకు అలగామరాజు రాజ్యమునకు వచ్చెను. దొడ్డనాయడు మృతిచెందిన తరువాత అతనికుమారుడు బ్రహ్మనాయడుండెను. అలగామరాజునొద్దకు



నాయకురాలను నొక యువతి జేరి యామెయే మంత్రిణి యాయెను. ఆమె క్రూరురాలు. అలగామరాజును సవతితమ్ములతో పోట్లాడునట్లు చేసి వారిని వెడలగొట్టించెను. వారుచిన్న పిల్లలగుటచే రాజ్యములో కొంత భాగము తీసికొని బ్రహ్మనాయడును, అలగామరాజు అల్లుడైనఅలరాజును, మరికొందరు వీరులును లేచిపోయి, మాచెర్ల అను పట్టణము నిర్మించుకొని, పిల్లల బదులు బ్రహ్మనాయడే మహా వైభవముతో పాలించుచుండెను.

ఇట్లుండ చూచి సహింపలేకనాయకురాలు బ్రహ్మనాయని కోడిపందెములలో నోడించి మండాది పట్టణమునకు వలసకు బొమ్మనెను. బ్రహ్మనాయడును, యువరాజును మాచెర్లను విడచి బయలుదేరగా అచ్చటివీరులైన ప్రజలందరును, తమ పశువుల మందలను సర్వమునుగూడ దీసికొని వెంటజనిరి. వీరందరు గండికోటను, నాగార్జునకొండను దాటి కృష్ణానది యొడ్డున యేలేశ్వరముచేరిరి. దారిలో లంకన్న యను వీరుడొక పులిని జంపెను. కృష్ణానదిని దాటుటకై వారు చిన్న పడవల నెక్కిరి. వానికిపుట్లుఅని పేరు. నదిలో ప్రయాణముచేయుచుండగా యువరాజు లెక్కిన పుట్టిపై నొక భయంకరమైన మొసలిబడబోవ, బ్రహ్మనాయడు దానిపై కురికి, ఒకరాతిబండపై నరికెను. అప్పటి నుండియు దానికి బ్రహ్మనాయని గుండు అనిపేరు ప్రసిద్ధికెక్కినది. వీరు మండాదిలో అడవులందుజేరి పెద్దపట్టణము గట్టిరి.



అచ్చట వారి వైభవమును, పశువుల సంపదను, చారుల వలన విని సహింపలేక తిరిగి నాయకురాలు వీరి అవులను పొడిచిచంపుటకై చెంచుల సైన్యమును పురిగొల్పిబంపెను. వారు పశువుల నాయకుడగు లంకన్నను జంపి, అవులకు కట్టుగట్టి



తోలుకొని పోవుచుండ బ్రహ్మనాయడు వారికట్టులను త్రిప్పి వేసి మరలించుకొని పోయెను.



బ్రహ్మనాయడును యువరాజులును యిట్లు 3 సంవత్సరములు మండాదివలసగడపి, వారితో శ్రీశైలముచేరి. అచ్చట

వీరమేడపియను గొప్ప పట్టణమును గట్టిరి. అప్పుడు వారు వలసలలో నుండవలసిన కాలము దాటినదని గ్రహించి, అలగా



మరాజు, అల్లుడైన అలరాజును, దమరాజ్యము దమకప్పంపుమని నాయకురాలునకు రాయబార మంపిరి. అలరాజు మామగారి



కొల్వునకు వచ్చి రాజ్యమడిగెను. అందులకు నాయకురాలు కోపగించి, పారిపోయిన వారికి రాజ్యమేమిటనినవ్వెను. అప్పు డతడు మీపై యుద్ధమునకు సిద్ధము. మనకు కారెంపూడిలో



యుద్ధముజరుగునుగాన తయారుగా నుండుడని వెడలిపోయెను.

నాయకురాలు వీనిని చంపుటకు భోజనమునకు రమ్మనెను. అతడు భార్యనైన చూడకపోవుచుండ విషముతో నిండినపూలగుత్తుల పంపి అలరాజును చంపించెను. అలరాజుభార్య ఈ వార్తవిని విలపించి అతనితో మేడపిచేరి సహగమనముచేసెను.

అచ్చట వీరులందరును బ్రహ్మనాయని కుమారుడైన బాలచంద్రునితో కలిసి అలగామరాజును వారివీరులను నిర్మూలింప శపథముచేసికొనిబయలుదేరిరి. అచ్చటవీరలకు ఘోరయుద్ధము జరిగెను. బాలచంద్రుడు అనేక శూరుల జంపెను. తుదకు అందరునుమరణింప, తానుకూడ బాణములపై పడిచనిపోయెను.

ఇట్టి గొప్ప వీరులు మన జిల్లాయందు సుమారు 400 సంవత్సరముల క్రిందట యుండిరి. ఇప్పుడు వారుకట్టినశిథిలములగు దేవాలయములు తప్ప మరే చిహ్నములును లేవు?

## ప్రశ్నలు.

1. పల్నాటి వీరులు శౌర్యవంతులని ఎట్లు చెప్పగలవు? కొన్ని నిదర్శనము లిమ్ము?
2. అలరాజు రాయబారమేమి? తుదకు యేమాయెను?
3. పల్నాటి వీర యుద్ధమునకు కారణములేమి?
4. నాయకురాలు చేసిన కొన్ని క్రూరకృత్యములను చెప్పుము.

## అధ్యాయము. III

ప్రాచీన కట్టడములు-కోటలు:—కొండవీడు, అమరావతి, బెల్లంకొండ, ఒంగవోలు, మంగళగిరి. మాచెర్ల, ఉండవల్లి

పైన జెప్పిన సుప్రసిద్ధమగు చరిత్రగల జిల్లా ప్రదేశములో ఆకాలమునాటి కట్టడములు కోటలు, శిథిలములైనను



విశేష శోభావంతమై నేటికిని ప్రకాశించుచున్నవి. వానియందు కొన్నిటిని యిందు వర్ణింతుము.

అమరావతి:—ఈపట్టణము గుంటూరునకు 20 మైళ్ళ దూరమున కృష్ణానది యొడ్డున నున్నది. ఇది సుమారు 1900 సంవత్సరముల క్రింద కట్టబడినది. ఆకాలమున యిచ్చట నొక గొప్ప విద్యాలయ మున్నదనియు, అనేక పండితులు గురువులుగానుండి భారతదేశమునుండి వచ్చువిద్యార్థులకు బోధించుచుండెడివారనియు తెలియుచున్నది. అందువలననే అప్పటి రాజైన కనిష్కుడు బౌద్ధమతమును వ్యాపింపజేయుటకు కొందరుసన్యాసులను బంపెను. వారు యిచ్చట నొక పెద్ద స్థూపమునుగట్టిరి. స్థూపమనగా బుద్ధదేవుని కాలిన యెముకలు లేకస్మారకచిహ్నముల నొక పాత్రలో నుంచి ఎత్తుగా దానిపై నొకదబ్బను చేసి దానిపై రాతితో గుండ్రముగా కట్టిన కట్టడము. దీనిచుట్టు రాళ్ళపై బుద్ధుని చర్యలు, వాని సిద్ధాంతములు మొదలగు అనేకచిత్రములు చెక్కబడినవి. ఈఅమరావతియందు రాళ్ళపై నుండు చిత్రపు చెక్కడపు పనులు లోకప్రసిద్ధముగుటచే వీనిని త్రవ్వి ఎత్తుకొని పోయి మద్రాసు మ్యూజియములో నుంచినారు. పిమ్మట ఇచ్చట హిందువులు దేవాలయమును గట్టిరి. ఇప్పుడా ప్రదేశము నిర్మూలమైనను, స్థూపము, దేవాలయమును కనబడును. ఇప్పుడు కృష్ణానది యీభాగములోనికి కోసికొనివచ్చినది. కనుకనే దేవాలయము కృష్ణలో లంకయందు

యున్నట్లున్నది. ఇట్టిప్రాచీన వైభవస్థానమును నీవృతప్పకచూచి ఆనందించవలయును.

కొండవీడు:— ఈపట్టణమిప్పుడొకచిన్నగ్రామము. దాని సమీపమున రెండుమైళ్ళలో పూర్వపురాజుల శిథిలమైన కోటగలదు. దీనిని ఆనుకొని కొండలపై బలిష్ఠమగు దుర్గమున్నది. ఈ కొండలు చూచుటకు దుర్గమున్నట్లు కన్పింపవు. కోట గోడలన్నియు నాశనము లైనవిగాని, సింహద్వారమును



బురుజులును కొంచెము ఆకారముగ నున్నవి. ఈదుర్గమునకు గ్రామమునుండి రెండుమైళ్లువంకరబాటగలదు. దుర్గముయొక్క-



సింహద్వారమునకు ముందు పెద్దకొండ లలోయగలదు. దానిని సమీపించుట మిగుల కష్టము. ముందు మూడుప్రక్కల ఎత్తైన కొండలున్నవి. నాలుగవప్రక్క ఒకదిబ్బ వేయబడినది. ఈదుర్గము నాలుగువైపులకొండలమధ్యనున్నది. నాలుగుకొండలమీదను నాలుగు బురుజులున్నవి. ఇప్పటికిని శోభావంతమై యున్నవి. (మిరియాల తొట్టి అను యీ బురుజు పటమును చూడుడు)



ఈదుర్గమందు మధ్యభాగమున నొక పెద్దచెరువున్నది. ఇందు నీరు నిర్మలమై ఎల్లకాల ముండును. బురుజులకు కట్టిన

రాతిబండలు చూచిన మనపూర్వులెట్టిశిల్పకారులో, ఎట్టివి పెద్దరాళ్ళను అస్థానములకుగొంపోయిరో, ఆశ్చర్యముపుట్టును. ఈచెరువుచుట్టు వెదుళ్ళున్నవి. కనుకదీనికివెదుళ్ళచెరువని పేరు.



వెదుళ్ళ చెరువు.

ఈ కోట పూర్వము చాళుక్యరాజులుకట్టినట్లు కొన్ని శాసనములుగలవు. వీరివద్దనుండి మరియొకవంశస్థులకుజిక్కెను. ఇట్లు చాల తరములవారు పాలించిన వెనుక మహమ్మదీయులాక్రమించిరి. వీరు హిందూదేవాలయములలో విగ్రహములను ముక్కులు, తలలు చెక్కియు పగులగొట్టియు, మసీదుల



గట్టియు అనేక విధముల నాశనము చేసిరి. అవి యిప్పుడును చూడగలుగుదుము. వేమేల యీ ప్రదేశమం దెచ్చట పోవుచున్నను, శాసనములు గల రాళ్ళు, విరిగిన విగ్రహములు పాడైన హిందూదేవాలయములు వానిపై మసీదులు, చిత్రపు పనులు చెక్కిన రాళ్ళు కన్పించును. ఈ కొండవీటిని గురించి యీ క్రింది పద్యములలో వర్ణింపబడినది.

కొండవీడు ఖిల్లా శిథిల ప్రశంస.

సీ. ఘనుడెఱ్ఱన కవీంద్రు డనయంబు
విద్యాధికారియై యేవీట గణనగాంచె
హర్షనైషధకావ్య మాంధ్రీకరించి
మేల్ కవిగండ డేవీట గణుతికెక్కె
పిచ్చివేమన వెఱ్ఱిపుచ్చకాయలనుండి
బంగార మేవీట బయలుదేరె
వేదాంతవేద్యుండై వెఱ్ఱివేమన యోగి
కేవీట వేదాంత మెఱుకపడియె

తే. గీ. లభ్యులౌ దేవతలకే యలభ్యమైన
పరుసవేదికలుండు నీపురి నటంచు
కెం వదంతి మహేవీటికి లభించె
నట్టి మన కొండవీడు నేడక్కటకట
కనుల గాంచిన దుఃఖంబు కలుగకున్నె.

సీ. మునురెడ్డిప్రభువులు కొల్వుదీరెడు
పీఠమా చెక్కు చెదరలేదు
నిన్ననో మొన్ననో నిర్మించినట్లుండుగాని
చీకటినాయి కాంతిదరుగ
దరిభయావహమైన మరఫిరంగీ లుంచు
బురుజులాయవి యింక మురువుసెడవు
నిగ్గుటద్దములట్లు నీడగన్పడుగాని
యాజ్యపొంగొట్టు లింకారలేదు
తే.గీ. అన్నిటికినేమి గాని యన్నన్న
యిప్పుడచ్చటాకోటయందున్నట్టి నంది
విగ్రహము గాంచి కనుల నీర్వెట్టనట్టి
మనుజు డెవ్వండయిన గాని మహిసిగలడె.

(ఖాసిం అలీ)

ఇట్టి ప్రఖ్యాతిని వహించిన కొండవీడు మన జిల్లాలో నుండుటచే మనబాలురందరు దానిని కన్నులారచూచియానందించక తప్పదు.

ఉండవల్లి:—ఇదియును కృష్ణానది గట్టుననున్న చిన్న గ్రామము. ఇది తాడేపల్లి రైలుస్టేషనునకు2మైళ్లలోనున్నది. పూర్వము కృష్ణానదియిచ్చటికొండలను దాకుచుండెను. ఇప్పుడు చాలదూరము దిబ్బవేసినది. ఇచ్చట పెద్దకొండలపై నొక కోటయును పెద్ద చెరువును గలవు. కొండ కొకప్రక్క గొప్ప



రాతితో చెక్కఁబడిన గుహలున్నవి. ఇవి మూడంతస్థులుగానున్నవి. చూచుటకు భవంతివలె నున్నవి. ఇందు మూడవ యంతస్థులో నొక గొప్ప యనంతశయన విగ్రహ మున్నది. పూర్వము బౌద్ధసన్యాసులచే నీగుహలు తొలువబడి పిమ్మట అనంతశయనుని దేవాలయముగా చేయబడి చాలప్రతిభగాంచి ఇప్పుడు దీపమైనను లేకుండ నున్నవి. ఇందుండి శ్రీశైలమునకు, తిరుపతికి, అమరావతికిని ఒకబిలము గలదనియు అందుండి యిప్పటికిని ఋషులు సంచారము చేయుచురనియు చెప్పుదురు. ఇవియును గాక మన జిల్లాలో ఒంగోలునందు దేవాలయములు కృష్ణదేవరాయలు నాటి కాలమున కట్టబడినవి. ఇట్టివింకను ధరణికోట, మాచెర్ల, మంగళగిరి యందు గొప్ప దేవాలయము లున్నవి. ఇవి యన్నియు పూర్వపు రాజుల వలన కట్టబడి చాల ప్రతిభగాంచినవి. ఇప్పటికిని మాచెర్ల, మంగళగిరి దేవాలయములు చాల ప్రసిద్ధిజెందియున్నవి.

## ప్రశ్నలు.

1. కొండవీటి చరిత్ర వ్రాయుము.
2. ఉండవల్లిలో మనము చూడగలుగున వేమి ?
3. అమరావతి యే కాలమునుండి దేనికి ప్రఖ్యాతి నొందెను ?
4. ఈ పటములను జూచి, నీ జిల్లాలోని పైచెప్పబడిన అన్ని ప్రదేశములు నీవు చూడవలెను.

## అధ్యాయము. IV.

### ప్రస్తుతరాజ్యభాగము-తాలూకాలు-రాజ్యపద్ధతి.

మీరు యీ జిల్లాపటమును చూడుడు. అందు ఎన్ని భాగములున్నవో చూడుడు. లెక్కించుడు. 9 భాగములున్నవి. ఈ భాగములు మన జిల్లాలో మన రాజ్య పద్ధతికై ఇంగ్లీషువారు ఏర్పరచిరి. వీనికి తాలూకాలని పేరు. మన జిల్లాయందు 9 తాలూకాలున్నవి. వీనికి పల్నాడు, సత్తెనపల్లి, నర్సారావుపేట, వినుకొండ, గుంటూరు, తెనాలి, రేపల్లె, బాపట్ల,వంగవోలు తాలూకాలని పేరు. వీనియందు మీరభూమి భాగములో ఎన్ని తాలూకాలున్నవో చూపుము. 5 తాలూకాలున్నవి. వాని పేర్లు పటము చూచి చెప్పుము. మైదాన భాగమునందు, తెనాలి, రేపల్లె, బాపట్ల, ఒంగోలు తాలూకాలున్నవి, తాలూకాలు సహజముగా ఏర్పడినవి గావు. ఒక్కొకటి సుమారు 7 లేక 8 మైళ్ల పొడవును, 5 లేక 6 మైళ్ల వెడల్పున నుండి, సుమారు 50 చదరపు మైళ్లవిస్తీర్ణముండును. ఒక్కొక్క తాలూకాకొక ముఖ్యపట్టణము యేర్పరుపబడినది. అందు ఆయా తాలూకా ముఖ్యాధికారియు, ఉద్యోగస్థులయు కార్యస్థానము లున్నవి. మన జిల్లా ప్రతి తాలూకాపేరును ఆ ముఖ్యపట్టణము పేరుననే పిలుచుచున్నాము. పల్నాడు తాలూకాకు ఒక్కదానికే దాచేపల్లి ముఖ్యపట్టణము.



ఈజిల్లాకు అంతకును కలెక్టరు అనుఒక అధికారినిఏర్పరచినారు. ఆయనగుంటూరునందుండును. ఆయనకచేరీలు, మొదలగు జిల్లాకు సంబంధించిన అన్ని కార్యాలయములు అక్కడనే యుండుటచే దీనికి గుంటూరు జిల్లాయని పేరు. ఇది 1912 వ సంవత్సరములో నేర్పాటు చేయబడినది. ఈ కలెక్టరు క్రింద 3 డివిజను కలెక్టరులున్నారు. ప్రతి తాలూకాకు ఒక తహశీలుదారు ముఖ్యాధికారి. ఈ రాజ్యపద్ధతి అంతయు నింగ్లీషువారేర్పరచినదే. అయినను మన పూర్వమునుండి యేర్పాటు చేసిన గ్రామ మునసబు, కరణములనే వీరు తిరిగి యేర్పరచి, వారసులకు హక్కులనిచ్చి, వారిపై యధికారులను మాత్రము క్రొత్తగా ఏర్పరచి, మనకుపూర్వముండు గ్రామసాంప్రదాయమును కొంతవరకు అనులులోనుంచినారు. పూర్వపు రెడ్డిప్రభువులుగాని వారి వారసులుగాని యెవరును కనుపించుట లేదు. గ్రామములలో నుండు రయితులు భూములకు పన్నులను యిత్తురు.

### ప్రశ్నలు.

1. మీరభూమిలోని తాలూకాలను పేర్కొనుము?
2. మొత్తముమీద మన జిల్లాలో నెన్ని తాలూకాలున్నవి?
3. జిల్లాలోని ముఖ్య యుద్యోగు లెవరు?
4. తాలూకాలను వాని ముఖ్యపట్టణములను పేర్కొనుము.

## అధ్యాయము. V.

### పీఠభూమియందలి తాలూకాలు.

గుంటూరుతాలూకా:-ఈతాలూకాపీఠభూమిలోనిది. ఇది సన్నసపొడవైనతాలూకా. దీనికిపడమటకొండలున్నవి. ఇచ్చట భూమితూర్పునకువాలియున్నది. దీనియందు రైలుమార్గములు రెండున్నవి. దీనియందుఅమరావతికొండవీడు మొదలగుసుప్రసిద్ధపట్టణములుగలవు. ఈప్రదేశములో ఉష్ణముమెండు. ఖండశీతోష్ణస్థితి. ఇచ్చటిగ్రామములందు మెట్టపైరులేపండును. వర్షముతక్కువ. విశేషముగా ప్రత్తి, మిరపకాయలు, కాయధాన్యములు పైరగును. ఈజిల్లాకుబెజవాడకు 20 మైళ్లదూరములోనున్న గుంటూరు ముఖ్యపట్టణము. ఇచ్చటనుండి దూది, మెట్టపైరులు, పొగాకు, మిర్చి విశేషముగా ఎగుమతియగును.






దూదివర్తకము మెండుగా జరుగును గనుక యంత్రశాలలున్నవి. ఈ పట్టణము చాల ఆరోగ్యమైనది. కాని బెట్టఅధికము. పటమును చూచి రైలుమార్గములను, కాలువలనుగుర్తించుము.

సత్తెనపల్లి:—ఇది గుంటూరునకు పడమటి తాలూకా. దీనికి కృష్ణానది యానుకొనియున్నది. ఇందుకొండలుమెండుగానున్నవి. వీనియందుబెల్లంకొండ యనుకొండపై శిథిలమగుబలమైన దుర్గమున్నది. ఈ తాలూకాయంతయుపీఠభూమియే. ఇందు రెండుకొండవాగులున్నవి. పటమున చూచి వాని పేర్లుచెప్పుము. ఇందు రైలు మార్గములు గాని, కాలువలుగాని లేవు. ఏల? వంటలు చాలా తక్కువ. గొప్పపట్టణములును లేవు. ఎందువలన? ఈ తాలూకాలోభూములుసారవంతమైనవి కావు. కనుకనే వర్తకము చాల తక్కువ. జనసంఖ్యయు తక్కువగా నున్నది.



నరసారావుపేట:—ఇదియును నొక చిన్న తాలూకా, గుంటూరు తాలూకాకు దక్షిణమున నున్నది. దీని గుండా చిన్న రైలు మార్గమున్నది. పటమున గుర్తింపుము. దీనికి పడమట కోటప్పకొండ, మరికొన్ని కొండ లున్నవి. ఈ కొండయందలి దేవాలయమునకు మహాశివరాత్రికి అనేకమంది మ్రొక్కులకు వెళ్ళుదురు. నరసారావుపేట యందు కూడ దూది, మిరపకాయలు, ఎగుమతి యగుచున్నవి. విశేషముగ ఇనుపసామానులు, కుర్చీలు, మంచములు, తయారుచేయబడి ఎగుమతి యగును.




వినుకొండ:—ఇది చాలబెట్ట తాలూకా. దీని దక్షిణ భాగమున గుండ్లకమ్మ నది ప్రవహించును. పటమును చూచి



కొండలు పడమట నున్నవి అనియు చెప్పగలవు. అచ్చట జనసంఖ్య తక్కువ. వర్షము తక్కువ. ఏల?




పల్నాడు:—ఇదియే పూర్వము ప్రసిద్ధి చెందినది. మీరు కథలలో చదివిన పట్టణముల గుర్తించుము. ఇచ్చట జనులకు పశువులు మెండుగ కలవు. భూమి విశేషముగ పండదు. ఏల?




## ప్రశ్నలు.

1. ప్రతి తాలూకాయొక్క పటమును చూచి ఎల్లలు చెప్పుము? ప్రతి తాలూకాయొక్క సహజపరిస్థితులు వర్ణింపుము.
3. అచ్చటి జనులు ముఖ్యవృత్తులు, పంటలను అచ్చటి శీతోష్ణస్థితి పరిస్థితులకు గల సంబంధము చెప్పుము.
4. వర్తక వ్యాపార మార్గములు యేయే తాలూకాలలో మెండుగా గలవు, ఏల?
5. ప్రతి తాలూకాలో ముఖ్యపట్టణములు చెప్పి అందులకు కారణములు చెప్పుము.

## అధ్యాయము VI.

### మైదానమందలి తాలూకాలు

తెనాలి:—ఈ తాలూకా గుంటూరు జిల్లాలో కెల్ల ప్రాముఖ్యమైనది. దీనియందు మంచి పల్లపు భూములున్నవి.






కృష్ణానది డెల్టాను ఆనుకొనియున్నది. ఇందు రెండు, రైలుమార్గములు, అనేక కాలువలున్నవి. కనుకనే ఇచ్చటనుండు బియ్యము, పసుపు, పొగాకు, చెఱకు విశేషముగా ఎగుమతి యగును. ఇచ్చటవర్తకము మెండుగా జరుగును. ఇచ్చట అనేక బియ్యపు ఫ్యాక్టరీలుగలవు. రోడ్లుకూడా విశేషముగా గలవు. జనసంఖ్య విశేషము. ఏల? ఇచ్చట జనుల వృత్తులు, ఆహారమును కారణములతో వర్ణింపుము.

రేపల్లెతాలూకా:—ఈతాలూకా కూడ కృష్ణాడెల్టా లోనిదే. ఇచ్చటి ప్రదేశమంతయు సమమైన మైదానము. దీని




యందు మంచి సారవంతమైన నేలయున్నది. దీని యందు రెండు కాలువలు వ్యాపించి యున్నవి. ఒకటి బ్యాంకు కాలువ కృష్ణానది గట్టువనే యున్నది. రెండవది నిజాం పట్టణము కాలువ. ఇది పూర్వపు రేవుపట్టణము వరకు వ్యాపించినది. ఇప్పుడు యోడవర్తకము నశించినది. ఇది యొక చిన్న గ్రామము. ఇచ్చట పల్లపుపంటలు వరి, పసుపు, లంకపొగాకు, విశేషముగా పండును. ఈ తాలూకా యొక్క శీతోష్ణస్థితి ఎట్లుండునో వర్ణింపుము. తెనాలి తాలూకా తర్వాత యీ తాలూకా మన జిల్లాలో కెల్ల ప్రసిద్ధిజెందినది. వర్తకము, పంటలు చాల ఎక్కువగా నున్నవి.

బాపట్ల తాలూకా:—ఈ తాలూకా సన్నగా పొడవున నున్నది. దీని పడమట కొండలగుండా రెండు వాగులు వచ్చి






బాపట్ల చెరువులో పడుచున్నవి. ఈ చెరువులో చాల భాగమిప్పుడు సేద్యము చేయుచున్నారు. ఈ తాలూకాలో తీర మైదానము విశేషము. ఇచ్చట యిసుక నేలలలో వేరుశనగ, సరకుచెట్లు, ముంత మామిడి చెట్లు (జీడిమామిడి) విశేషముగా పండును. మిగతా పల్లపు నేలలందు వరి విశేషముగ పండును. పడమర వైపున కాయధాన్యములు, జొన్నలు, చోళ్ళు, ధనియములు ఫలించును. మంచిశీతోష్ణస్థితిగలదు. ఇచ్చటతీరమున నేబక్కింగుహాము కాలువయు, దాని ప్రక్కగనే రైలుమార్గమును గలవు. ఇచ్చటినుండి వేరుశెనగ, జీడిపప్పు విశేషముగ ఎగుమతియగును. చీరాల, వేటపాలెములలో గుడ్డలనేత చాల ప్రసిద్ధము. వీనిని పటములో గుర్తింపుము.

వంగవోలు తాలూకా:—తీరమైదానమందున మిగతా తాలూకాలవలెగాక, యీ తాలూకాలో పడమటిసగభాగము పీఠభూమి యందే యున్నది. ఇందుచే మకురి కొండలని ఎత్తైన కొండలున్నవి. వీనిగుండ, గుండ్లకమ్మనది దారిచేసికొని యీ తాలూకాగుండా సముద్రమున గలియును. ఇచ్చట వరిపంట తక్కువ. మెట్టధాన్యములు, జొన్న, సజ్జ నియములు మొదలగు పంటలు విరివిగా పండును. ఈ



BY. L.N. ELLORE-1925

తాలూకాలో పడమటిభాగములో శీతోష్ణస్థితి చాలా బెట్టగానే యుండును. ఇచ్చటనే కొత్తపట్టణమను పురాతన రేవు పట్టణమున్నది. ఇప్పుడచట శిధిలమైన కట్టడములు, ఇండ్లు కనుపించునుగాని, పూర్వపు వైభవము అంతరించినది.

వంగవోలు పశువులకు ప్రసిద్ధి. ఇచ్చట గొప్ప పశువుల సంత ప్రతిసంవత్సరము జరుగుచుండెడివి. అప్పుడు జావా, ఆస్ట్రే-



లియా, సింహళము, మొదలగు దేశములనుండి విదేశీయులు వచ్చి యెద్దు ఒకటికి రు 500 కూడ ధరలుపెట్టి తీసికొని పోవుచుండెడివారు. ఇప్పుడు గవర్నమెంటువారు దీనిని ఆపుచేసిరి. వంగవోలు పూర్వము స్వతంత్ర రాజులక్రింద నుండెడిది. వీరు విజయనగర రాజులకు సామంతులై యుండెడివారు. ఇప్పటికిని శిధిలమైన కోట పెల్లూరను సమీప గ్రామమునందు గలదు. వంగవోలు నందుకూడా చాల వ్యాపారము జరుగును.

## ప్రశ్నలు.

వెనుకటి విధముననే ప్రతి తాలూకాను గురించి వ్రాయుము.

సమాప్తము

